## ఉత్తరాలు

### ఆంధ్రులందరూ సమైక్యత కోరుతున్నారా?

రాజధాని కబుర్లు మీద శ్రీ కాశీపతి రాసిన ఉత్తరం నాయకులలో దిన దినం పెచ్చిపోతున్న అవకాశవాదాన్ని చక్కగా నిరూపించింది. 1969 లో అసలు రజాకారు దుండగాలతో సతమతమై పోయిన అమాయిక కోస్తా, రాయలసీమ ప్రజల అగచాట్లు కాని, పోలీసు తుపాకీగుండ్లకి ఆహుతి అయిపోయిన సుమారు వందమంది తెలంగాణావారి ఆక్రందనలు గాని శ్రీమతి ఇందిరానెహ్రూగాంధీగారి మనస్సుని చలింపచేయలేదు. తెలుగు రాజధానిలో మంటలు లేచినా, తెలుగు ప్రాంతంలోనే తెలుగువారు కాందీశీకులుగా పారిపోతున్న పరిస్థితులు ఏర్పడినప్పటికీ ఆమెగారికి తెలంగాణా సమస్య అంటూ ఒకటి ఉందని తెలియలేదు! కానీ యీనాడు తన అధికారం నిలబెట్టుకోటానికి ఆమె పడే ఆవేదన వర్ణనాతీతం. కేవలం 14 పార్లమెంటు సీట్లు దక్కించుకోటానికి ఆమెచూపిన ఆత్రుత, శ్రీ చెన్నారెడ్డిని ఆశ్రయించిన తీరు ఈ దేశ నాయకత్వానికే సిగ్గుచేటు. ప్రత్యేక తెలంగాణా రావాలనే ఆత్రుత, తెలంగాణా ప్రజలకన్నా, ఈ ప్రాంతం నాయకులకన్నా, శ్రీమతి ఇందిరా నెహ్రూ గాంధికే ఎక్కువగా ఉందని అనిపిస్తుంది. కాని, ఆమె ప్రత్యేక తెలంగాణాకి బహిరంగంగా సుముఖత చూపక పోవడానికి రెండు కారణాలు ఉండవచ్చు. [1] ఇప్పుడే యీ విషయంలో బయటపడిపోతే కోస్తా రాయలసీమ ప్రాంత ప్రజలు తన పార్టీకి వోట్లు వేయరనే అపోహ (2) రాష్ట్ర నాయకత్వాన్ని గుప్పిటలో ఉంచుకొన్న శ్రీ బ్రహ్మానందరెడ్డి బెదిరింపు. ఈ రెండు ఆమె నోటిని కట్టివేసాయి. రెండో కారణం నిజమేమోకాని మొదటిది ఆమె అపోహ మాత్రమే. ఎందుకంటే 1969 లో జరిగిన రజాకారు బ్రాండు తెలంగాణా ఆందోళన రుచి చూసాక కోస్తా రాయలసీమ ప్రజలకు సమైక్య ఆంధ్రప్రదేశ్‌లో విశ్వాసం పూర్తిగా పోయింది. వారికి ఆంధ్రప్రదేశ్ కన్న ఆత్మగౌరవం ముఖ్యం కాబట్టే సమైక్య ఆంధ్రప్రదేశ్ ఉండి తీరాలనే ఆందోళనకాని నిరాహారదీక్షలుకాని ఆ రెండు ప్రాంతాల్లో జరుగలేదు. ఇది వేరే విషయం. కాని దేశ నాయకులలో పేరుకుపోతున్న అవకాశవాదం సామాన్య ప్రజల్లో ఆందోళన, ఆవేదన నిరుత్సాహం కలుగజేస్తున్నాయి. శ్రీమతి ఇందిరా నెహ్రూ గాంధిగారి తమిళనాడు ఒప్పందంవల్ల జాతీయపార్టీ అయిన న్యూ కాంగ్రెస్ ఆ రాష్ట్రం శాసనసభకు పోటీచేసే హక్కును పోగొట్టుకొంది. పార్లమెంటులో మెజారిటీ పొందవలెనన్న ఆమె ఆత్రుతకు ఇది మరొక నిదర్శనం. జాతీయపార్టీలైన స్వతంత్ర, సంస్థా కాంగ్రెసు, జనసంఘంలు కూడ అవకాశవాదాన్ని ప్రోత్సహించటం దురదృష్టకరం. (ఈపార్టీలు శివసేనతో ఒప్పందానికివచ్చాయి).

ఈనాడు ఏ పార్టీలో చూసిన సిద్ధాంతాలు మంట కలసిపోతున్నాయి. బీదలపాట్లు తమ బాటలని ఉపన్యాసాలు దంచే కమ్యూనిస్టు సభ్యులు కొందరు నైటు క్లబ్బులో విలాస జీవితానికి అలవాటు పడ్డారు. దేశభక్తి, భారతీయ సంస్కృతి అని వాపోయే జనసంఘంవారు కొందరు యింటినిండా, వంటినిండా విదేశీయ స్మగుల్డ్ గూడ్సుని నింపుకుంటున్నారు. అవినీతిని బహిరంగంగా దూషిస్తూనే, అవినీతిలో మునిగి తేలుతున్న కాంగ్రెసువారు ఎందరు లేరు!

భారతదేశమా ఏమి నీ దౌర్భాగ్యము!

ఒక సామాన్యుడు [హైదరాబాదు]

# ఎమెస్కో పాకెట్ బుక్స్

## 71 ఫిబ్రవరి విడుదలలు




| | | |
|---|---|---|
| ఆకర్షణ<br>కొమ్మూరి వేణు గోపాలరావు | మలుపు మెరుపు<br>ఎమ్వీయల్ | తల్లి మనసు<br>పి. రామలక్ష్మి |
| రమణి రాసిన ఉత్తరం<br>కప్పగంతుల సత్యనారాయణ | ప్రమదావనము<br>వేంకట పార్వతీశ్వర కవులు | విజయవిలాసము<br>చేమకూర వేంకటకవి |

ఎమెస్కో పాకెట్ బుక్స్ పుస్తకాలు షాపుల్లోనూ, న్యూస్ ఏజంట్ల వద్దా దొరుకుతాయి. లేదా తిన్నగా మాకు రాయండి. ఇవన్నీ ఒకేసారి తెప్పించుకుంటే పోస్టేజీ ఉచితం. పూర్తి ఖరీదు ముందే మనియార్డరు కట్టాలి. విడిగా ప్రతులు కావాలంటే ఒకో ప్రతి ఖరీదూ, అదనంగా 25 పై. పోస్టేజీ చేర్చి ముందే మనియార్డరు కట్టాలి. రిజిస్టరు పోస్టు కావాలంటే ప్యాకెట్ కి 95 పైసలు అదనం.





ఎమెస్కో వారింతవరకూ మీ అభిమాన రచయితల రచనలు 150 ప్రచురించారు. పూర్తి లిస్టు ఎమెస్కో పాకెట్ బుక్స్ ఆఖరి పేజీల్లో వుంటుంది. ప్రతి వెల రెండే రూపాయలు. సంప్రదాయ సాహితి క్రింద పంచకావ్యాలూ, ప్రబంధ సాహిత్యం క్రింద నాలుగు పుస్తకాలూ విడుదలయ్యాయి. అన్నీ ఇంటింటా అవశ్యం వుండవలసిన పుస్తకాలు

## 71 జనవరి విడుదలలు

| | | | | |
|---|---|---|---|---|
| నీలి<br>పురాణం సుబ్రహ్మణ్య శర్మ కథలు | మళ్ళీ రైలు తప్పిపోయింది<br>గొల్లపూడి మారుతీరావు | పైపాటు<br>'కృష్ణ' | సంపంగి<br>బలివాడ కాంతారావు | ప్రభావతీ ప్రద్యుమ్నము |

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్
సికింద్రాబాద్

## సీరియల్

22—1—71 నాటి సచిత్ర వార పత్రికలో ప్రత్తిపాడువారి ఉత్తరం చదివే సరికి నాకు అదో లాగా అనిపించింది. అంటే దేవీ స్తోత్రం చదివే వారు 'దేముడు' అని అనకూడదనా లేక 'దేముడ' అనేవారు దేవ స్తోత్రం చదవకూడదనా? ఇందులో ఏమిటి వారి అభిప్రాయం?

శ్రీమతి సుందరమ్మగారితో మాకు పరిచయం లేక పోయినా దాదాపుగా పదిహేను సంవత్సరాలు పట్టి ఆల్ ఇండియా రేడియో [ముఖ్యంగా మహిళా మండలి.] ద్వారా వారి రచనలు మాత్రం మాకు చిరపరిచితము లైనవే?

వారిరచన లెప్పుడూ కొత్త పద్ధతుల్లో నడుస్తూ! అతి సున్నితంగా! చక్కని నీతుల్ని బోధిస్తూ వుంటాయి. అందువల్ల వారి రచనలు వినడంకోసరం మేమంతా ఏపుడూ ఎంతో? ఆసక్తి చూపుతూ వుంటాం.

అటువంటి ఉత్తమ రచనల్లో ఏదో అతిస్వల్ప పొరపాట్ని గుర్తించి అపార్థం చేయ్యడం ఏమంత సమంజసం కాదని నా అభిప్రాయం.

లేదా అచ్చుపొరబాటువల్లా! ఇటువంటి

## ఉత్తరాలు

లోపాలు రావచ్చు: లేక వాతావరణాన్ని బట్టి మాటల తేడావల్ల అయ్యుండవచ్చు.

ముఖ్యంగా 1 గ్రాంధిక భాషని ఎప్పుడైతే వదిలేస్తున్నామో అపుడిక ఇటువంటి లోపాలన్నీ దేశాచారంగా వాడే మాటల్ని బట్టి కల్గుతూ వుంటాయని నా అభిప్రాయం, ఇదే నిజం కూడా.

కె కనకవల్లి. [మద్రాసు]

పై వారమే ప్రారంభం!
### కొత్త శీర్షిక
### పడించే మనవాళ్ల కథలు
రచన
కె. వి. ఎన్. శర్మ




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 19—2—'71
శ్రీసాధారణనామ సం॥ మాఘమాసం॥ బ॥ నవమి
సంపుటము : 64 సంచిక : 24

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

# రాష్ట్రంలో అధికార కాంగ్రెస్ అభ్యర్థుల నిర్ణయంలో ముఖ్యమంత్రి పైచేయి

నాలుగు సంవత్సరాల క్రితం జరిగిన సార్వత్రిక ఎన్నికలకు ముందు దేశంలో భారత జాతీయ కాంగ్రెస్ సమైక్యంగానే ఉంది. కాని ఆంధ్రప్రదేశ్‌లో అప్పటికే చీలిపోయింది. ఆరోజుల్లో ముఖ్యంగా కోస్తా ప్రాంతంలో ఆనాడు కూడా కాంగ్రెస్ వారలు రెండు వర్గాలుగా పోటీ చేశారు. ఒక అభ్యర్థి తనది బ్రహ్మానందరెడ్డి కాంగ్రెస్ అని చెప్పుకుంటే మరొక అభ్యర్థి తనది సంజీవరెడ్డి కాంగ్రెస్ అని చెప్పుకున్నారు. ఈ చీలిక నెల్లూరు జిల్లాలోను కర్నూలు, అనంతపురం జిల్లాల్లోను మరీ ప్రస్ఫుటంగా కనిపించింది. ఈ రెండు వర్గాలు ఈసారి సిండికేట్ ఇండికేట్‌గా విడిపోయినా దాదాపు రెండు వ్యక్తిగత వర్గాలుగానే పోటీ చేస్తున్నాయి. కొన్ని కొన్ని నియోజక వర్గాల్లో అభ్యర్థిని బట్టి, తమ పార్టీలకు సంబంధం లేకుండానే కార్యకర్తలు స్థానిక నాయకులు పనిచేయవచ్చును. ఉదాహరణకి విశాఖపట్నాం. ఇక్కడ తెన్నేటి విశ్వనాథం గారిని బలపరచాలని అధికార కాంగ్రెస్ నిర్ణయించుకున్నది. కాని ఆపార్టీకి చెందిన స్థానిక నాయకులు, కార్యకర్తలు విశ్వనాథంగారిని కాక పి. వి. జి. రాజు గారిని గెలిపించడానికి బహిరంగంగానే పని చేస్తున్నారు. పి. వి. జి. రాజుగారు స్వతంత్రంగా పోటీ చేస్తున్నా, ఆయనకు వ్యతిరేకంగా సంస్థా కాంగ్రెస్ వారు కాని వేరే ఐక్య కూటమికి చెందిన మరొక పార్టీ కాని అభ్యర్థిని పెట్టలేదు. పెండేకంటి వెంకట సుబ్బయ్య గారు సరిగా కీలకమైన ఘడియలో తమపార్టీ ఐన సంస్థా కాంగ్రెసు హఠాత్తుగా వదిలి వేసి ఇందిరాగాంధిగారి చలవతో అధికారకాంగ్రెస్ టిక్కెట్టుపైన లోక్ సభకు పోటీ చేస్తున్నారు. కాని ఈయనకు పలుకుబడి కలిగిన స్థానిక అధికార కాంగ్రెస్ నాయకుల సహాయ సహకారాలు లభ్యమవుతాయనడానికి వీల్లేదు.

## ముఖ్యమంత్రిదే పైచేయి

నిజానికి వెంకట సుబ్బయ్యగారు అధికార కాంగ్రెస్‌లోచేరడం రాష్ట్రంలోని ఆపార్టీ నాయకుల్లో అంత ఉత్సాహాన్ని ఆసక్తిని కలిగించలేదు. నంద్యాల నియోజక వర్గానికి ఆయన్ను ఎంపిక చేయడం కూడా వారికంతగా ఇష్టం లేదు. బ్రహ్మానంద రెడ్డిగారు ఇంకా హైదరాబాదులో ఉండగానే ఢిల్లీ నుంచి నంద్యాలకు వెంకట సుబ్బయ్య గారిని ఎంపిక చేసినట్లు ప్రకటన వచ్చింది. ఏవో ఒకటి రెండు నియోజక వర్గాల్లో మినహా ఆంధ్ర విషయంలో, ప్రధానమంత్రికంటే ముఖ్యమంత్రి గారిదే పైచేయిగా కనిపిస్తున్నది. కమ్యూనిస్టులతో పొత్తు విషయంలో కూడా బ్రహ్మానంద రెడ్డిగారు, ప్రధాని వైఖరి కంటే భిన్నమైన దానినే అవలంభించారు. కడప, సిద్దిపేట స్థానాలను కమ్యూనిస్టులకు వదిలి వేశారంటే ప్రధాని కోరికను మన్నించాలని కాక వాస్తవ పరిస్థితి గుర్తించడం మూలాన్నే నని చెప్ప వలసి ఉంటుంది. కడపలో కమ్యూనిస్టు అభ్యర్థి ఈశ్వర రెడ్డి గారికి ప్రజా మన్నన హెచ్చుకాని కాంగ్రెస్ వారంతా సమైక్యంగా కృషి చేస్తే విజయం అసాధ్యమైనది కాదు. కాని కాంగ్రెస్ వారలు సమైక్యంగా ఉండడం సంభవం కాదు కదా. ఏ ఒకవర్గానికి చెందిన అభ్యర్థిని ఎంపిక చేసినా మరొకవర్గం తప్పకుండా అతన్ని వోడించడానికి కృషి చేస్తుంది. ఆజిల్లాలోని రెండు వర్గాలు అధికార కాంగ్రెస్‌వే. ఇక సిద్దిపేటలో అధికార కాంగ్రెస్ విజయం కలలోని మాట. ఆ అపజయమేదో కమ్యూనిస్టులకే దక్కనీయమని అధికార కాంగ్రెసు సంతృప్తి చెందుతున్నది. కమ్యూనిస్టులు పీఠం కావలిస్థానాన్ని కోరారు కాని నెల్లూరు రిజర్వుడు స్థానాన్ని తీసుకోమని బ్రహ్మానందరెడ్డిగారు చెప్పారు. చివరికి కావలి, నెల్లూరు రెంటిలో కూడా త్రికోణమైన పోటీ తప్పేట్లు లేదు.

## లోక్‌సభకి వావిలాల పోటీ!

వావిలాల గోపాలకృష్ణయ్యగారు లోక్‌సభా ఎన్నికల రంగంలో దూకడం గుంటూరు జిల్లా రాజకీయాలు తెలిసిన వారందరికి విడ్డూరంగా తోచక మానదు. వావిలాల గారికి లోక్ సభాసభ్యునికి ఉండవలసిన యోగ్యతార్హతలు, ప్రజావ్యవహారాల పరిజ్ఞానం, అనుభవంలేవని కాదు. ఇతర అభ్యర్థులు పలువురి కంటే ఈ యోగ్యతలు శ్రీ వావిలాలలో హెచ్చు మోతాదు లోనే ఉన్నాయి. కాని గుంటూరు నియోజక వర్గంలో ఆయన విజయానికి కల అవకాశాలేమిటి? ఆయన నిశ్చయానికి ఒక కారణం కనిపిస్తున్నది. శ్రీ వావిలాల కమ్యూనిస్టు పార్టీని ఎప్పుడో వదిలేశారు. కాని ఆయన్నొక అభ్యుదయ వాదిగా కమ్యూనిస్టులు శాసన సభా ఎన్నికల్లో సమర్థిస్తూ వస్తున్నారు. కాని కమ్యూనిస్టు చీలికలు రావడంతో ఆయనకు గొప్ప చిక్కు వచ్చి పడింది. మార్క్సిస్టులు, భారత కమ్యూనిస్టు పార్టీ వారు ఉభయులు కూడా వావిలాల వారు తమనే బలపరుస్తారని ఆశిస్తున్నారు, రెండువైపుల నుంచి వస్తున్న వత్తిడిని తప్పించుకొనడానికి ఆయనే స్వయంగా పోటీ చేయాలని నిశ్చయించుకున్నారని చెబుతున్నారు.

## ప్రభుత్వోద్యోగాల్నించి ఎన్నికల రంగంలోకి

ప్రభుత్వోద్యోగులు ఉద్యోగ విరమణ చేయగానే

కలకత్తా ఆంధ్రా అసోసియేషన్ ప్రముఖ ఆంధ్ర పారిశ్రామికవేత్త శ్రీ గోగినేని [illegible] గౌరవార్థంచేసిన సభలో అధ్యక్షులు శ్రీ టి. వి. ఆర్. మూర్తి [illegible] కార్యదర్శి శ్రీ వి. సుబ్బారావు

రాజకీయల్లో ప్రవేశించడం, ఎన్నికల్లో పోటీ చేయడం, మన రాష్ట్రంలో కూడా కొత్తేమీ కాదు కాని ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పదవి నుంచి తప్పుకొని సచివాలయం నుంచి సరాసరి ఎన్నికల రంగం ప్రవేశం చేయడం ఎం. టి. రాజుగారి ప్రత్యేకత. ఈయనకు ముందు ప్రధాన కార్యదర్శులుగా పని చేసిన శ్రీ ఓ. పుల్లారెడ్డి, శ్రీ ఎం. పి. పాయ్, శ్రీ అనంతరామన్ గారలు వేర్వేరు ఉద్యోగాల్లో మళ్లీ ప్రవేశించారు. శ్రీ పుల్లారెడ్డి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులవుతే, శ్రీ పాయ్ టారిఫ్ కమిషనర్, హిందూస్తాన్ షిప్ యార్డ్ చైర్మన్‌గా పని చేశారు. శ్రీ అనంతరామన్ రాష్ట్ర విజిలెన్సు కమిషన్ చైర్మన్‌గా నియుక్తులయారు.

డాక్టర్ కె. ఎల్. రావుగారు 1962 నుంచి లోక్‌సభకు ఎన్నికైన మొదటి టెక్నోక్రాట్. చీఫ్ ఇంజనీయరుగా రిటైరైన శ్రీ నయాజీ రావుగారు స్వతంత్రపార్టీ టికెట్టుపై పోటీచేసి ఒకసారి ఓడిపోయారు. ఈసారి మళ్ళీ ఆయన గుడివాడ స్థానానికి పోటీ చేస్తున్నారు. గెలుపు అవకాశాలు పూర్వంకంటే మెరుగ్గా కనిపిస్తున్నాయని వారి పార్టీ వర్గాల ద్వారా తెలుస్తున్నది. వీరిద్దరు, ఎం. టి. రాజు గారు కాక శ్రీ సి. నరసింహంగారుకూడా రాజమండ్రి స్థానానికి స్వతంత్రంగా పోటీ చేద్దామనుకున్నారు.

హైదరాబాదు పార్లమెంటరీ స్థానానికి అధికార కాంగ్రెసు మద్దతుతో స్వతంత్రంగా పోటీచేస్తున్న బద్రుద్దీన్ తయబ్జీ కూడా ఒకప్పుడు ప్రభుత్వోద్యోగే. ఐ. పి. ఎస్. ఉద్యోగిగా సేవ చేసి మన విదేశాంగ మంత్రాంగం శాఖా కార్యదర్శి బాధ్యతలనే కాక వివిధ దేశాల్లో మన రాయబారిగా పనిచేసి మన్ననలందుకున్న ముస్లిం మేధావి ఆయన. ఆలీఘర్ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుడుగా కూడా పని చేశారు. కొంతకాలంగా ఆయన ఈ నగరంలోనే స్థిర నివాసం ఏర్పరుచుకున్నారు. ఇటీవల ఢిల్లీలో జరిగిన ముస్లిం రాజకీయ సదస్సుకు అధ్యక్షత వహించి ముస్లిం రాజకీయ ఆశయాలకు రూపురేఖలు దిద్దుతున్నారు. ముస్లిములకు పార్లమెంటులో, శాసన సభల్లో, ప్రభుత్వం, మిలిటరి ఉద్యోగాల్లో వారి జనాభా ప్రాతిపదికగా స్థానాలను ప్రత్యేకించాలని ఈ సదస్సులో కోరారు. ఈయనకు అధికార కాంగ్రెస్ మద్దతు లభించడం అల్పసంఖ్యాకుల రాజకీయాల గూర్చి ఆపార్టీ వైఖరిలో వచ్చిన మార్పుకు తార్కాణమో లేక ఆపార్టీ రాజకీయ ప్రయోజనాలకొరకై విధానాలను విడనాడడానికి తార్కాణమో తెలియదు. కాని ఏ మజ్లిస్ అభ్యర్థినో సమర్థించడం కన్న తయబ్జీని బలపరచడం సంతసించ దగినది.

## సెక్యులరిజంకి అధికార కాంగ్రెస్ సేవ!

హైదరాబాదు, సికింద్రాబాదు, పార్లమెంటరీ స్థానాల్లో అధికార కాంగ్రెస్ విజయం అసంభవమన్న నిర్ణయానికి ఆపార్టీ నాయకత్వం ఎప్పుడో వచ్చింది. కాని రాజధాని నగరంలో ముస్లిం జనాభా [illegible] పెక్కు సంస్థలు ముఖ్యంగా అసెంబ్లీలో రాజధాని నుంచి మూడు స్థానాలనుంచి ప్రాతినిధ్యం పొందగలిగిన మజ్లిసే—ఇత్తెహాదుల్ ముసల్మీన్ ప్రత్యేక తెలంగాణా వాదానికి వ్యతిరేకం కావడంమూలాన్న మజ్లిస్ అభ్యర్థినే కాంగ్రెస్ సమర్థించగలదని తెలిసిన తరువాత మజ్లిస్ వర్గాల్లో అనైక్యత బాగా ప్రబలిపోయింది. ఇప్పటి ముగ్గురు మజ్లిస్ శాసన సభ్యుల్లోను ఇద్దరు ప్రభుత్వానికి ఇటీవల కాలంలో చాలా సన్నిహితులై పోయారు. దీనిమూలంగాకూడా మజ్లిస్‌లో వారి పట్ల తిరస్కారభావం ఏర్పడిపోయింది. ఏమైనా పైన చెప్పినట్లు తయబ్జీలాంటి అనుభవ శాలి. విద్యావేత్త ను, ఆయన అభిప్రాయాలేమైనప్పటికీ, అధికార కాంగ్రెస్ బలపరచడం మంచిదే. ఐతే ఆయన గెలుపుతో హైదరాబాదు నగరంలో ముస్లిములు ముస్లిమేతరులు రాజకీయంగా విడిపోవడం సంభవించవచ్చును. ఇది సెక్యులరిజంకు అధికార కాంగ్రెస్ [illegible]

హైదరాబాదు నగరంలో హెచ్చు శాతం హైదరాబాదు నియోజక వర్గంలో కంటే సికిందరాబాదు నియోజక వర్గంలోనే ఉంటుంది. హైదరాబాదు నియోజక వర్గంలో నగరానికి సమీపంలోని గ్రామీణ ప్రాంతం కూడా ఉంటుంది. ఇన్నాళ్లకు అధికార కాంగ్రెసుకు సికిందరాబాద్ నియోజక వర్గంనుంచి పోటీ చేయడానికి శ్రీ లక్ష్మినారాయణ యాదవ్ అనే వ్యక్తి లభించాడు. కాంగ్రెస్ ఈయన్ను అభ్యర్థిగా ఎంపిక చేసిందని ప్రకటించిన తరువాతనే ఈయన గురించి లోకం తెలుసుకో గలిగింది. హైదరాబాదులో ప్రముఖ ముస్లిమ్‌కు కాంగ్రెస్ మద్దతు, సికిందరాబాదు ప్రత్యేక రాష్ట్ర వాదుల్లో అనైక్యత మూలంగా ఈ రెండు నియోజక వర్గాల ఎన్నికల ఫలితం చిత్రంగా నుండ వచ్చును.

—వి. నాగేశ్వరరావు

# నాగరికత



అంగర వెంకట కృష్ణారావు

మూడు రోజుల్నించీ పడుతున్న ముసురు వాన అవాళ తెల్లవారుఝామునే తెరిపిచ్చింది.

ఆకాశం స్వచ్ఛంగా వుంది. బస్సు స్టాండు బురద, నీటి గుంటలమయంగా వుంది. మూడురోజుల తరవాత తొలిసారి కనిపించిన సూర్యుడు బారెడు పైకి లేచేడు. ఎండ కరకర్లాడుతూంది. నీటి గుంటల్లో సూర్యకాంతికి కళ్లు చెదురుతున్నాయి.

బురదనీ, నీటి గుంటల్నీ తప్పుకొని మనుషులు హడావిడిగా తిరుగుతున్నారు. కొందరు తాపీగా చుట్టలు సిగరెట్లు కాలుస్తూ పుస్తకాల షాపుల్దగ్గిర పుస్తకాలు తిరగేస్తున్నారు.

'సినిమా పాటల పుస్తకాలు, మదన కామరాజు కథలు, డిటెక్టివ్ నవలలు; కవి చౌడప్పశతకం...' అమ్మకాలు.

'ప్రేమించి పెళ్లిచేసుకో...'లౌడ్‌స్పీకరు గొంతిక.

'బాబా ధర్మం — అమ్మా ధర్మం' ముష్టివాళ్లు.

'మరి వుంటాను. వెళ్లగానే వుత్తరం రాయి.' వీడ్కోలు మాటలు.

ఎండ కరకర పొడిచినా రివ్వున గాలి వీస్తూంది.

బస్సులు ముందుకీ వెనక్కీ డ్రిల్లు చేస్తూ ఘుర్ఘురిస్తున్నాయి.

ఉదయం యేడున్నర.

వేచూ బస్సు కోసం ఎదురు చూస్తున్నా.

దూరంగా మేదరిగూడెం: అన్నీపాకలు. ఆ చుట్టు పక్కలంతా కుళ్లు బురద, కంపునీరు.

దూరంగా మేదరివాళ్లు తిరుగుతున్నారు. కొందరు అక్కడే పబ్లిగ్గా మల విసర్జన చేస్తున్నారు.

చిన్నా పెద్దా చాలా పందులు గునగున తిరుగుతున్నాయి. అపురూపంగా వచ్చిన ఆ వుదయపు ఎండలో అవికూడా ముచ్చటగా వున్నాయి. అవి ఆనందంగా 'గుర్ గుర్' మంటూ, వంక తిరిగిన చిరు తోకలు ఆడిస్తూ, దొరికింది మేస్తున్నాయి.

పరాగ్గా యింకోవేపు చూస్తున్నా. హటాత్తుగా పంది 'గీ' అని అరిచింది. అటు చూశా. నలుగురు మనుషులు పందిని తలకిందులా మోసుకుపోతున్నారు. ఆ పంది నీరసంగా 'గీ గీ' అంటూంది.

అక్కడికి కొంచెం యెగువ తాటాకుల పోగులోంచి పొగ దట్టంగా లేస్తూంది. ఆ పొగలోంచి మనుషులు హడావిడిగా తిరుగుతూ అపుపిస్తున్నారు. ఒకళ్లిద్దరు తాటాకులతో విసురుతూ, తాటాకు మంటల్ని రాజ బెడుతున్నారు. ఇద్దరు గొంతికిలా కూచుని చూస్తున్నారు.

మోసుకొచ్చిన వాళ్ళు పంది నక్కడ దింపేరు. అది కదల్డంలేదు. కాని ఇంకా సన్నంగా 'గీ' అంటూంది.

విసురుతున్నవాళ్లు తాటాకులతో జోరుగా విసిరారు. చిన్న చిన్న మంటలు లేచి నాట్యం చేస్తున్నాయి. పొగ వొక స్తంభంలా ఆకాశం పొడుగునా లేచింది.

గొంతుకిలా కూచున్నవాళ్లు లేచి పందిని మంటల్లో పెట్టేరు. విసురుతున్నవాళ్లు మరీ జోరుగా విసిరేరు. పంది వెంట్రుకలు మాడిపోతున్నాయి. కామోసు. ఒకడు దువ్వెనతో దువ్వినట్టు దేంతోనో గీస్తున్నాడు. మంటలు మరి కొంచెం లేచేయి.

గొంతుకిలా కూచున్నవాళ్లు తిరిగి గొంతికిలా కూచున్నారు. విసురుతున్న వాళ్లు మరీ జోరుగా విసిరేరు. కర్ర పట్టుకున్నవాడు. మరో యిద్దరు తిరిగి వచ్చినవేపు వెళ్లేరు.

ఈ కార్యక్రమం సినిమాలో 'లాంగ్ షాట్'లా కపిపిస్తూంది.

10—2—71

త్కొన్నాతలేసిన బిస్సంకా రాలేదు. ఇలాగే ఆలస్యంగా వస్తుందేమో. వచ్చే ప్రతి బస్సూ దూరంనించి వుదయపు ఎండలో తళతళ మెరుస్తూ, నా ఆశాదీపాన్ని ప్రజ్వరిల్ల జేస్తూంది.

అక్కడ తాటాకుల మంటలు బాగా లేచాయి. పొగ సన్నగిల్లింది. జ్వాల హెచ్చింది.

పరాగ్గావున్నా ఇటువెంపు మరో పంది 'గీ' అంది. తుళ్ళిపడ్డా.

పంది వెనకాళ్ళకి బంధం, నెత్తిమీద దెబ్బ వొకేసారి పడ్డాయి. పంది అడ్డంగా తిరగబడింది నేలమీద. బంధం బాగా పడకుండా తప్పించేందికి తన్నుకుంటుంది.

ఆ మనిషి సన్నగా పొడుగ్గా వున్నాడు. లుంగీ కట్టుకున్నాడు పొడుగాటి గిరజాల జుత్తు. అతని చేతిలో అతనికంటె పొడుగ్గా రోకలిలాంటి బలమైన కర్ర వుంది. యమదూతలా వున్నాడు.

పంది బంధం బలంగా పడనీకుండా. ప్రాణం కోసం, పంది బతుకైనా బతుక్కోసం గింజాకుంది. కళ్ళు వూడినంత వన్నైంది. యమదూత రెండు చేతుల తోటీ రోకలియెత్తి, వెనకవెంపు నేలతాకే వరకూ ఆచపెట్టి, బలంకొద్దీ దాని చెంపమీద మోదేడు. నా మొహం ఝుమాలుమంది. పంది గజేంద్రుడిలా 'పాహి పాహి' అని వొక చావుకేక వేసింది.

దానికి చావాల్ని లేదు. పంది చావు చావాల్ని లేదు.

తిరిగి వొక విడిలింపు విదిలించింది. బంధిస్తున్న బంధాలు విడిపోయినంత పనైంది.

వెంటనే యమదూత తిరిగి రోకలి యెత్తి బలంగా పార్శ్వభాగంమీద వరసగా దక్షిదభీమని యిరవైసార్లు మోదేడు. దెబ్బదెబ్బకీ ఆ ప్రాణి 'గీ' పెట్టింది. గింజకుంది. పంది ప్రాణం ప్రాణం కాదా? దానికి ప్రాణంమీద తీపిలేదా? క్రమేణా దాని స్వరం సన్నగిల్లింది. ఆ రోకలి దెబ్బలకి దాని శరీరంలో సుమారు అన్ని యెముకలూ విరిగిపోయుంటాయి.

నా కాళ్ళు గజగజలాడేయి. నేల నింగి గిరగిర తిరుగుతున్నాయి. కడుపులో తిప్పేది. వాంతి వచ్చినట్లయింది.

ఆ పందిని కూడా వాళ్ళు తలకిందులా మంటల్దగ్గరకి మోసుకుపోయేరు. అక్కడ దింపేరు. ఎండలో యమదూత గిరజాలు దులుపుకుని రోకలినానుకుని నిలబడ్డాడు.

వెంటనే గొంతికిలా కూచున్నాళ్ళు లేచి పందిని మంటల్లో పెట్టేరు తాటాకులవాళ్ళు జోరుగా విసిరేరు. ఎండలో మంటలు నాట్యం చేసేయి. మాడిపోయిన పంది వెంట్రుకలొకడు దేంతోనో గబగబ దుల్పేసేడు.

ఇంత నిర్దయగా, నిండు ప్రాణాన్ని, గట్టి ప్రాణాన్ని రోకలితో సగం తీసి, మిగిలిన సగాన్ని తాటాకు మంటల్లో కాల్చిన వీళ్ళు మనుషులా? వీళ్ళు మనుషులైతే నట్టి అనాగరికులు. ఇంకా అడివి మృగాల స్థాయిలో వున్నారనుకున్నా.

ఈ దారుణ సంఘటన వన్నెంతోకాలం వెంటాడింది. భగవాన్! నాకే పుట్టుకైనా ఇయ్యి. కాని పంది పుట్టుక వద్దు. ఆ యమదూత— వాడి రోకలి— తాటాకుల మంటలు— భగవాన్! నేను భరించలేను.

# నాగరికత

ఈ ఉదంతం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, నేను పంది పుట్టుక పుడతానా — అమ్మో! అవి పుచ్చమటలు పోసి పోయేవి. ఆ యమదూత రోకలి నాకళ్ల ముందు నాట్యం చేసేది.

కాని కాలక్రమేణా ఆ భయంకర యజ్ఞ కాండ నా స్మృతి పథంలో చెరిగిపోయింది.

కొన్నాళ్ల తరవాత ఒక సాయంత్రం నేనొక పెద్ద డిపార్టుమెంటలు స్టోర్సుకి వెళ్లా. అక్కడ జనం కిటకిటలాడు తున్నారు.

నేను స్టోర్సు లోపలికి వెడుతూంటే, యెదురుగా ఒక పురుషుడూ ఒక స్త్రీ వస్తున్నారు. వాళ్లు బహుశా దంపతు లయుంటారు. తెల్లగా, ఆరోగ్యంగా, దేవతల్లా వున్నారు. అతను ఖరీదైన సూటు తొడుక్కున్నాడు. ఆ యువతి సరికొత్త రకం చీర యౌవనపు పొంగు స్పష్టంగా కనిపించేలా ధరించింది. వాళ్ల మొహాల మీద చిరునవ్వు వెలుగుతూంది. వాళ్లు రూపం ధరించిన నాగరికత, నడుస్తూన్న సభ్యతలా వున్నారు. ఇద్దరి చేతుల్లోనూ అందమైన ప్లాస్టిక్కు సంచులున్నాయి. ఆ యువతి పట్టుకొన్న సంచీలో, పైకపుపిస్తూ ఒక రంగురంగుల, అందమైన డిజైను గల చిన్న డబ్బా వుంది. ఆ డబ్బామీద ఇంగ్లీషులో 'బేకన్' అని వుంది. నా దృష్టి దానిమీద పడింది.

వెంటనే నా తల తిరిగింది. నా కాళ్ల కింద నేల, స్టోర్సు పైకప్పూ గిరగిర తిరుగుతున్నై.

భగవాన్! ఎవడు వాడు! గిరజాల జుత్తు. పొడుగ్గా లుంగీ రోకలిలాంటి పొడుగాటికర్ర నెవకనెంపు భూమి తాకే వరకూ ఆచి పెట్టి బలంకొద్దీ మోదుతున్నాడు. ప్రభూ! ఈ వేదన భరించలేను. ప్రాణం పోతూంది. పాహి పాహి— అని పంది గీపెడుతూంది.

అందమైన రంగురంగుల డబ్బా నాగరికతకి చిహ్నం. అందులో వున్న పంది యేమపో? దుస్తులు నాగరికతకి చిహ్నం, ఆ దుస్తుల్లో వున్న మనుషులో? ●

ప్రశ్నలని 'ప్రశ్నావళి', ఆంధ్ర పత్రిక వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి పంపాలి.



# నగ్న దిగంబర సత్యం

'లేకపోతే మన వూళ్ళో ఫ్యాక్టరీ యజమాని రాజాగారిక్కి రోజులు దగ్గరపడి వుండవచ్చు. వాడి వయస్సెంత? వాడు చేసే పనులేమిటి? ఒకవైపు కాలేజీలకు డొనేషన్లు ఇస్తూనే వుంటాడు. ఇంకో వైపు గ్రాంట్లు తీసికుంటూనే వుంటాడు. ఊళ్ళో ఏ సభ జరిగినా వేదికపై కూర్చోవలసినదే. చేసేవన్నీ రాక్షసపనులు చెప్పేవన్నీ శ్రీరంగ నీతులు. వాళ్ల ఫ్యాక్టరీకి ఏ పెద్ద క్రొత్త ఆఫీసరనేవాడు వచ్చినా పెద్ద పెద్ద పార్టీలు ఆ ఫ్యాక్టరీ ఆవరణలోని 'గెస్ట్ హౌస్' అవబడే ఇంద్రజాలమేడలో జరగవలసినదే

'ఒకరోజు సాయంత్రం ఫ్యాక్టరీ యజమాని రాజాగారు కారులో ఫ్యాక్టరీలోనికి ప్రవేశిస్తూవుంటే వాచ్‌మన్ రంగయ్యకు ఒకామె క్యారియర్ ఇస్తూండడం చూసాడు. ఆమె ఎర్రగా, ఆరోజే తలస్నానము చేయడంచే ముంగురులు గాలికి నుదురుపై వూగుతూ ఆకర్షణీయంగా వుండటంచే రాజాగారు మరోసారి చూసాడు. తరువాత ఆఫీసుగదిలోకి వెళ్ళి రాజాగారు రంగయ్యకు కబురు పంపించారు. ఆరోజు రాత్రి గెస్టుహౌస్ పార్టీకి ఆ ఎర్ర అమ్మాయిని పురమాయించమన్నారు.

దానికి రంగయ్య 'ఏంటి? బాబుగారు! అది నా కూతురు. ఈ ఉదయం అత్తింటి నుంచి మొగుడూరు కెళ్తే. వొచ్చింది. నా చిన్నగాడ్కి చలి కాస్తూంటే ఆ యాళ క్యారియర్ తెచ్చినాది బాబుగారు!' అన్నాడు.

'ఎవరైతే నేంరా! డబ్బు కావరిస్తే, రెట్టింపో మూడింతలో ఇద్దాం' అని రాజుగారు అన్నారు.

'బాబుగారు! మా కష్టజీవితాలు గూర్చి మీకు తెల్దు. మాలోకూడా నీతి నియమా లున్నాయి. ఈవిషయం మీరు మర్చిపోండి. నా గొంతులో ప్రాణంవుండగా అటువంటివి జరుగదు బాబు' అని రంగయ్య అన్నాడు.

'దానికి రాజుగారు 'రంగయ్యా! నా సంగతి నీకు బాగా తెలుసు. నేను అనుకున్నపని జరుగవలసినదే. నీ ప్రాణం తీసి వాపని చేసుకోమంటే, దానికి సిద్ధమే. నీకు రాత్రి 8 గంటలవరకూ టైము ఇస్తున్నాను. ఆలోచించుకో?' అన్నారు.

'రంగయ్య మాట్లాడకుండా డ్యూటీలోనికి వెళ్ళిపోయాడు. తరువాత ఫ్యాక్టరీ మేనేజరు ఒకసారి రంగయ్యను పిలిచి బాబుగారి సంగతి గుర్తుచేసి బాబుగారు తలచుకుంటే ఏదైనా చేస్తారు పెద్ద వాళ్లతో భేటీ దేనికి, అన్నాడు. దానికి రంగయ్య 'ఇందులో బాబుగారి పెద్దరికమేముంది? ఇటువంటివాటిల్లో ఆయన మాలాటి వాళ్లందరికన్నా నీచాతి నీచం. ఆయనకు లేని అలవాటు లేదు అన్నిటికీ బానిసే. అన్నిటినీ కప్పిపుచ్చడానికి డబ్బొకటి వుంది. అందులోనే ఆయన పెద్ద. నాకు వెయ్యి చెప్పినా, నా చేతులారా ఈ నీతిలేని పనిచెయ్యను నమ్మచంప ఏదైనా చేస్తే ఆపాపం దేవుడిదే. నాదిమాత్రం కాదు' అని గేటుదగ్గరికి వెళ్ళిపోయాడు.

తరువాత రాజాగారి గదిలో మేనేజరు, రాజాగారు కాసేపు మాట్లాడుకున్నారు. మేనేజరు ఎక్కడకో ఫోను చేసాడు.

అర్ధరాత్రి సమయంలో ఫ్యాక్టరీగేటు, వాచ్‌మన్ గోపురం రెంటినీ చూసుకుంటూ ఒక లారీవెళ్ళి గుద్దుకుంది. 'ఏక్సిడెంట్, ఎక్సిడెంట్' అంటూ ఫ్యాక్టరీలోని నైట్ షిఫ్టు వాళ్ళు కొంతమంది పరుగెత్తుకొని వచ్చారు హాస్పిటల్‌కి తీసుకొని వెళ్తూండగనే వాచ్‌మన్ రంగయ్య కళ్ళు మూసాడు'.

రావుగారు దుఃఖాన్ని దిగమింగుతూ 'ఇది నిజమేనంటావా? శాస్త్రీ! పాపం! రంగయ్య నా తోటమాలిగా వున్నా సరిపోయేది' అన్నారు

దానికి శాస్త్రి 'ఇది నగ్నసత్యం' అని జవాబిచ్చాడు

ఇదంతా వింటూ సోఫాలో కూర్చొన్న రామేశంయొక్క దిగంబర స్వగతము.

'ఓరి! ధనాంధకారి!
పచ్చినెత్తురు త్రాగే పైశాచి!
నీ ఆశకు అంతే లేదా?
నీ తృష్ణకు ఒడ్డే లేదా?'




ఎన్నో సంగతులలో విపరీతంగా మారిన మగవాడి మనస్తత్వం ఉద్యోగరంగంలో ఏమాత్రం మారిందో వో క్షణం ఎప్పుడేనా ఆలోచించారా? తనతోపాటు పని చేస్తున్న స్త్రీని తనకు సమానంగా మగవాడు భావించడం అనేది ఎండమావి వంటి ఎండమావులవేటే. సమానమైన పనికి సమానమైన జీతాలుండాలని యెంత మొత్తుకుంటున్నా, మగవాళ్ళు పనిలో ఆడవారు వారికి సమానం అని ఒప్పుకోరు. సరికదా వారి కంటేసి జీతాలు పోయడం డబ్బు దండగ అని కూడా భావిస్తుంటారు. 'ఏం నీలాగా పనిచేయలేనా ఏం?' అని ఏ గుమాస్తానేనా అధికారి ప్రశ్నిస్తే వో చిన్ననవ్వు నవ్వి. 'ఈ విషయంలోనేకాదు సార్, ఆడవారి సమానత్వానికి అన్ని సందర్భాలలోనూ— అంతా లాభం. అసలు నష్టంలేదు అన్న లాజిక్ మీదే ఉంటుంది' అంటాడు. తనతోపాటు ఆడది పని చేస్తుందంటే ఈ మగవాడెందుకంత గిలగిల్లాడిపోతాడో అర్థంకాదు. అనవసరంగా యెత్తిపొడవడం, ఎద్దేవా చేయడం, లేనిపోనివి కల్పించి చిన్నచూపు చూడ్డం మొదలైనవన్నీ జెలసీ ఫలితమా? 'ఆ అక్కడా అక్కడా ఒకటే అరా ఆడది రాణించినంతమాత్రాన మగవానికేం లోటు రాదు' అని కొందరు ధీమాగా అంటారే గని మనస్ఫూర్తిగా కాదు. 'ఆడదంటే తక్కువటండీ, పైకలా మెత్తమెత్తగా కన్పిస్తూ, అబలగా చెలామణి అవుతూనే సంసారాల్లో పైచేయి సాధించలేకుంటారా?' అన్నాట్ట వో కన్నెపిల్లతో పని చేస్తున్న వో గుమాస్తాగారు. ఎప్పుడూ ఆడవారంటే అభిమానించే మా మామయ్యే కొంచెం కదిలిస్తే చాలు— అసలు రంగు బయటపడుతుంది చక్కని సౌమ్యమూర్తిగా పేరుగాంచిన పెద్దమనిషి కాస్తా 'నేను మగవాణ్ని' అన్న గర్వంతో — నిలబడి తన ఆధిక్యం వత్తివేసే పరమ వీరపురుషుడిగా సాక్షాత్కరిస్తాడు!

దీనికి అంతా కారణం మన ఆడవాళ్ళే అన్నా తప్పుకాదు. మూడేళ్ళనాని గాడు కూడా కనిపెడతాడు — తాను [illegible] కంటే ఘనుడినని. ఇంక పెరుగుతున్న కాలం అంతా — ఈ ఘనతని రుజువు చేసుకొందుకే తాపత్రయపడతాడు.

'నువ్వు మగాడివోయ్' అంటూ అమ్మా నాన్నా [illegible] ఈ ప్రత్యేకత ప్రారంభం అవుతుంది. 'ఛీ మగాడివి ఏడవచ్చా?' అంటూ వేళాకోళం చేస్తారు. కాని నాలుగేళ్ల పసివాడెలా తాను మగవాణ్నని ఆడవారికంటె గొప్పవాడిననీ నిరూపించుకుంటాడు? దీనికి సమాధానం మన పరిణామంలోనే ఉందంటారు కొందరు ప్రముఖులు (కోతా?) కాని కొందరంటారు— ఈ మొండితనం, మోటుతనం, తెగింపు, దురాక్రమణ ధోరణి నేర్చుకున్నవేనని కాని ఒకటి మటుకు నిజం. తల్లిదండ్రులు మొగపిల్లల్లో ఈ ధోరణిని ప్రోత్సహిస్తారు. వారి దృష్టిలో మగవాడంటే అలాగా ఉండాలని ఉంటుంది. 'ఛ ఆడపిల్లలా, తిరిగి ఒక్కటి వడేయిలేవూ?' 'కానియ్' అంటూ [illegible]స్తారు మగవాళ్లకి పుట్టినదగ్గరనుంచీ శక్తి ఎక్కువే ఉంటుందనిపిస్తుంది. ఇక కాలంతోపాటు క్రమశిక్షణసమస్యలు అబ్బాయిల్లోనే ఎక్కువగా తలెత్తుతాయి. విధ్వంసకధోరణి. వితండవాదన, ఎదురుతిరగడం ముక్కోపితనం, పేచీలు, దెబ్బలాటలు— అన్నీవస్తాయి వీరిమధ్యకి. దీనికి కారణం? చిన్నతనంలోనుంచీ నూరిపోసిన 'అబ్బాయిలు అబ్బాయిలే!' అన్న నమ్మకం. 'నిజమే. దెబ్బలాడకోవడం కొట్టుకోడం మగపిల్లల్లోనే ఎక్కువ; అంతే కాదు ఛస్తే తప్పు ఒప్పుకోరు. 'నేను మొదలెట్టలేదు వాడే కొట్టాడు. మొదట నేను తిరిగికొట్టాను అంటారు' అంది అనుభవజ్ఞురాలైన వో తల్లి.

ఎందుకిలా అబ్బాయిల్లో బిహేవియర్ సమస్యలు అధికంగా ఉంటాయి? అంటే— తమ గొప్పతనం, ఘనత, మగతనం నిరూపించుకోవాలన్న తపనే అని సమాధానం చెప్పుకోవాలి. మీ రెప్పుడేనా గమనించారో లేదో, ఆటలో కూడా తను ఆధిక్యత నిరూపించుకోడానికి మహా తాపత్రయ పడతారు అబ్బాయిలు. వారి ఆటవస్తువులు, చూసేటందుకు సినిమాలు, చదివే సాహిత్యం అన్నీ వేరుగానే ఉంటూ ఉంటాయి. తల్లిదండ్రులు, స్కూల్లో టీచర్లు మగవారిమీద కొంత బరువు మోపుతారు, చేసే ప్రతి పనీ మగవానికి తగినట్టుండాలని హెచ్చరిస్తూ ఉంటారు. కాని అతి దురాక్రమణ ధోరణిలోకి పడిపోకుండా కూడా హెచ్చరిస్తూ ఉంటారు అంచేత ఈ విభిన్నమైన హెచ్చరికల విషచక్రంలో ఇరుక్కున్న అబ్బాయి ఏం చేస్తాడు? ఏం చేసినా రైటు కాదు. ఏం చేసినా త[illegible] కాదు. వో పక్క 'ఊఁ సాగు, మగవాడివి కాదా?' అని ప్రోత్సహించి ముందుకు తోస్తూ, రెండో చేత్తో 'ఆగు. అంత తెగించకు' అంటే ఏం చేస్తాడు? నేటి సంఘంలో మగవాడు సరిగ్గా ఈ విషచక్రంలో ఇరుక్కున్నట్టే ఉన్నాడు. అందుకే పోటీ ఆడదాన్ని ఈజీగా భావించలేడు, కాదని తోసి వేయనూ లేడు.



# ఏ మనసులో ఏముందో ...?

ప్రబతుకు తెరువుకోసం అరళప్ప అనే అతను తన భార్య ఆనీమేరీతో సహా బెంగుళూరు వచ్చి వూరు వూరంతా తిరుగుతూ పోలీసు డెప్యూటీ కమిషనర్‌వారి ఆఫీసు ప్రాంతానికి వచ్చేసరికి ఆ ఆఫీసులో పనిచేస్తున్న గోవిందప్ప అనే ప్యూను వారిని పసిగట్టాడట. పసిగట్టి, తను మేరీకి కైపిస్తు, వుద్యోగం వేయిస్తానని వో అప్లికేషను, యాభై రూపాయలు లంచం తీసుకుని ఆఫీసులోపలకు వెళ్ళి, యిచ్చినట్టు నటించి, తిరిగొచ్చి ఆరాత్రి, చామరాజ పేటలో వున్న తన యింట్లో తలదాచుకోమన్నాడట. గోవిందప్ప గొప్పమనసుకు ఆదంపతులు ముచ్చట పడ్డారట. దంపతులింటిలోపల, గోవిందప్ప బయట పడుకున్నారట. అర్ధరాత్రి అయ్యాక గోవిందప్ప తలుపు తట్టాడట. అరళప్పలేచి, తలుపు తీసేసరికి చటుక్కునతన్ని వీధిలోకి గెంటేసి గోవిందప్ప తలుపు లోపలికు వేసేసి, ఆనీమేరీని బలాత్కరించ బోయాడట. అరళప్ప బయటనుంచి, ఆనీ లోపలనుంచి గావుకేకలు వేసే సరికి తన వాంఛ నెరవేరక, భయంతో పారిపోయాడటా గోవిందప్ప— అదేవిటబ్బా!

## తప్పతాగి అన్న యిల్లు తగల పెట్టిన తమ్ముడు!

తట్టచ్చేరి అనే గ్రామంలో మణివేల్ అనే అతను బాగా తప్ప తాగి వచ్చి తన అన్నగారిభార్యను




సి, అంతటో ఆగక బాగా తన్నాడట. అదేమి అడిగిన అన్న సుబ్బారాయుడ్ని తిట్టేసి, ...వం చల్లారక వాళ్ళ యింటి మీదకి రవ ...సి నిప్పంటించి యిల్లు కాలి బూడిదై పోవటా సేశాడు

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## పశువుల వ్యాపారిని ఎత్తుకుపోయిన ముసుగు మనుషులు!

ఢిల్లీ అజిట్ నగర్‌కు చెందిన 40 ఏళ్ల నరేన్ సింగ్ అనే వో పశువుల వ్యాపారి యింటికి ఒకతను [20 బుధవారం సాయంత్రం] వెళ్ళి, తాను దున్నపోతును కొనదల్చు కున్నట్టు తెలియజేశాడు. దాంతో నరేన్‌సింగ్ ఆకొత్త వ్యక్తితో తన పశువుల పాకవద్దకు వెళ్లేసరికి అక్కడ మరోముగ్గురు ముసుగు వ్యక్తులు ఎదురై 'కిం అనకుండా కారెక్కు' అని పిస్తల్సు చూపారట. భయంతో నరేన్‌సింగ్ గావు కేక వేసే సరికి దారిపోయేవారు వచ్చినా పిస్తల్సు చూసి నిరుత్సాహపడ్డంవల్ల ఆ నలుగురు నరేన్‌ని తీసుకు చక్కాపోయారట— ఎందుకూ!!!!

* * *

బెంగళూరులో భాస్కర్ అనే ఒక తోటలు సొంతదారునికి పిన్నమంగళలో వున్న తనయిల్లు 15 వేల రూపాయలకు అమ్మతానని మాటిచ్చి సబ్ జాన్ అనే అతను భాస్కర్‌ని ఆ డబ్బుతో సిద్ధంగా, వుండమన్నాడట. అన్న టయిముకు సబ్‌జాన్ పోలీసు సబ్‌ఇనస్పెక్టర్ సత్యనారాయణ అనే అతన్నీ మరో యిద్దర్నీ సహాయంగా తీసుకుని పోలీసుజీపులో భాస్కర్ వద్దకు వెళ్ళాడట. అక్కడ సత్యనారాయణ భాస్కర్ చేతిలో డబ్బు చివాలున లాక్కుని జీపులో వుడాయించాడట. ఈ నలుగుర్నీ పట్టుకుని, చట్టం తలో అయిదేళ్ళా శిక్ష విధించిందట— ధించదూ!!

## కలుషిత మవుతున్న సముద్రం!

ప్రతిదీ తీసుకెళ్ళి సముద్రంలో కలపడంవల్ల రాన్రాను సముద్రం నాశనమై పోతోందని, దీనివల్ల మానవజాతికే తీరని నష్టమని, ప్రాణనష్టమని, రోమ్‌లో ప్రొఫెసర్ జాక్విస్ పిక్కార్డ్ ప్రకటించారట. మనకు కావలసిన ఆక్సిజనులో 50 నుంచి 70 శాతం సముద్రంనుంచే లభిస్తున్నదని, సముద్రాన్ని కలుషితం చేయడం వల్ల యీ ఆక్సిజను వుత్పత్తి తగ్గిపోతోందని, కనుక యిది మానవప్రాణాలకే ముప్పు అని అన్నారట. ప్రతి ఏడూ వైజ్ఞానిక, తదితర అవసర, [అనవసర] ప్రయోగాలవల్ల 2 లక్షల టన్నుల సీసము, 10 లక్షల టన్నుల దూనెలు, 5 వేల టన్నుల పాదరసం సముద్రంలో కలుపుతున్నామని కూడా ఆయన నివేదించారట.

## పద్నాలుగో కాన్పులో నలుగురు పిల్లలు

మధురకు చెందిన కరుపట్టి అనే గ్రామంలో ఒకామె ఒకే కాన్పులో ముగ్గురాడపిల్లల్ని, ఒక మగపిల్లాడిని కన్నదట. ఆమెకది పద్నాలుగో కాన్పట. తల్లీ ఆకవల [నాలుగు] పిల్లలూ ఖుషాగా వున్నట్టు ఆసుపత్రి ప్రకటించింది.

## పరీక్ష నాళిక పిల్లలు!

పిల్లలు పుట్టటంలేదన్న బెంగతో ఆసేతు హిమాచల పర్యంతం ఇక పీఠాధ తిరగవలసిన పని వుండనే వుండదు. పరీక్ష నాళిక ద్వారా బిడ్డ పుట్టడం అనే ప్రయోగం వట్టి మాట కాదని కేంబ్రిడ్జి జనం నోసంవత్సర కాలంలో పరిశోధన



నాళిక ద్వారా పుట్టిన బిడ్డను చూసి తీరుతుందని నోబెల్ బహుమతి గ్రహీత డాక్టర్ జేమ్స్ వాట్సన్ అన్నారట. పురుషుని వీర్యకణాలతో స్త్రీ అండ సంబంధ కణాలను శోధన నాళికలో కలిపి, అనక అవి ఒక స్థితికి వచ్చిన పిమ్మట ఒకస్త్రీగర్భం లోకి ప్రవేశ పెట్టడం ద్వారా ఆస్త్రీ గర్భవతి అవుతుందని, యీ ప్రయోగంలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం కు చెందిన డా. రాబర్ట్ ఎడ్వర్డ్స్, డా. పాట్రిక్ స్టెప్టో అనే వారిరువురు చాలా వరకూ విజయం సాధించారని ఆయనన్నారట.

## హాట్ పాంట్

న్యూయార్కు ఫ్యాషనిటీవలి హాట్‌ప్యాంటు అనే వో కొత్త బలి లాగూ కనిపెట్టిందట. ఈ ప్యాంటును మెచ్చుకుంటూ నటి ఉర్సులా ఆండ్రూస్ చాలాబాగుంది మినిస్కర్ట్ [బుల్లి గౌను పెద్దవాళ్ళకు]ను కూడా చాలా పెద్ద గౌనులా కనిపింప చేసేలా వుంది. తొడలు పిక్కలవంత.... అసహ్యంగా వుంది అనే వరకూ కనిపిస్తాయి లాగూ తొడుక్కుంటే. ఎంచక్కా, అన్నదట. వరాలు జివ్వుమనే చలిలో కూడా న్యూయార్క్ సుందరీమణులు యీ ప్యాంటులు తొడుక్కుని తిరుగుతున్నారట— బాపురే!!

### పుస్తకం తెచ్చిన తంటా

పాకిస్తాన్‌లో టర్కీ పద్ధతి ప్రేమ అని వో పుస్తకం అచ్చయ్యొచ్చిందట. ఆపుస్తకంలో స్త్రీ పురుష కలయికలు 57 బొమ్మలు వున్నాయట. ఈ బొమ్మల్లోని నాయకి 21 ఏళ్ల రాగిజుట్టు సుందరి మేరియా ఫాస్ట్ అనే ఆమె బ్రిటనుకు చెందినదట. తనను తన ప్రియుణ్ణి వివిధ భంగిమలలో కొందరు ఫోటోలు తీశారని అయితే అవి ఆదేశంలో అమ్ముతున్నట్టు తనకు చెప్పనే లేదని ఆమె అన్నాడట. తాను, తన ప్రియుడు, జానీ బజార్లో కనుపించిన అపుస్తకాలన్ని కొని తగుల బెట్టావావి ఆమె అన్నదట. బ్రిటిష్ వనిత ఆ ఫలానా పుస్తకంలోని బొమ్మలకు పోజులు ఇవ్వడం వలన బ్రిటన్ దేశం తమ దేశాన్ని అవమానించినట్టు లెక్కగట్టి పాకిస్థాన్ ప్రజలు, బ్రిటిష్ ఆఫీసుల మీద పడ్డారట. ఈ బొమ్మలు తీసుకున్నందుకు ఆమెకు 500 స్టెర్లింగులు [9000 రూపాయలు] ముట్టాయట.

### జోకులు కానివి

కాంగ్రెసు ప్రెసిడెంటు జగజ్జీవనరామ్‌కోడలు నిజలింగప్ప కాంగ్రెసు తరపున తన మామగారికి ప్రత్యర్థిగా శెహారుకు చెందిన ససరన్ నుంచి పోటీ చేస్తోందట. ఢిల్లీ రామ్ లీలా మైదానంలో ఇందిరా గాంధి కాంగ్రెసు సభలో ఎన్నికల ప్రచారానికి గాను పోగైన నిధి పదిలక్షల రూపాయలను ప్రధాన మంత్రి శ్రీమతి గాంధికి సమర్పించారట.

కలకత్తా నుంచి రోముకు పోయె వో ప్రయాణికుని సూట్కేసులో పెద్దమొత్తం విస్కీసీసాలతో పాటు దొంగిలించిన ... యట సజీవంగా.



### లైట్స్ ఆన్

27వ తేదీన హూగ్లీనదిలో వో ఏడు శవాలు దొరికాయట. పరికించి చూడగా అందులో వొక వ్యక్తి మాత్రం చావు బ్రతుకులమధ్య వూగిసలాడుతున్నట్లు తేలి అతన్ని ఆసుపత్రిలో చేర్చారట. విచారణను బట్టి వీరు ఏ రాజకీయ పార్టీకి చెందివుండరని, జయనగర్ పోలీసు స్టేషను ప్రాంతానికి చెందిన వో గ్రామంలో బహుశా వీరేదుగురూ దోచుకోడానికి వెళితే ఆ గ్రామవాసులు చంపేసి వుండుంటారని తేలిందట.

ష్యామ్ పూకర్ అనే వూరిలో వో చిన్న టీ షాపు యజమాని వో 14ఏళ్ళ వ్యక్తిని ఎవరో నక్సలైటులనమానింపబడివారు చంపే శారట. బాలిఘటవద్ద 35ఏళ్ళ నేరాల్ బెనర్జీ అనే ఆయన్ను ఎవరో బాంబులతో పేల్చి చంపేశారట.ఆయన మార్కెట్టునుంచి వస్తూండగా గజన్ సర్కార్ రోడ్డు క్రాసులో చంపేశారట. హవురా జిల్లాకు చెందిన విలోహాల్‌లో వో మార్కిస్టు పనివారి గుంపు మీద ఎవరో బాంబుల వర్షం కురింపిన సందర్భంలో వో వ్యక్తి చనిపోయాడట. ●

# ప్రశ్నావళి

**...కె. రామలక్ష్మి...**

**ఎమ్. ఎమ్, అయిజ**

నా దృష్టిలో ప్రేమ పవిత్రమైనది.

ఎవరి దృష్టిలోనైనా అంతే బ్రదర్, కొందరికి మటుకు నిషిద్ధప్రేమ మరీ కోరతగ్గదిగా కన్పిస్తూ ఉంటుంది.

**ఎమ్. ఎస్. ఆర్, బరంపురం**

మతాంతర వివాహాలపై మీ అభిప్రాయం.

మనసులొకటైతే మతం వేరైతేనేమి?

**ఎస్. కె ఆర్, ఎర్లాకిమిడి**

ఈ రోజుల్లో ఎలాంటివారిని బాగా నమ్మి స్నేహం చేయాలి సిస్టర్?

ఈ కాలంలో కాదు, ఏ కాలంలోనైనా—ఎవరినీ గుడ్డిగా నమ్మడం అర్థంలేని పని. వ్యక్తిత్వపు విలువ చంపుకొని ఎవరితోటీ స్నేహం చేయడం తగదు.

**పి. ఎస్. ఆర్, బిట్రగుంట**

చెవులో 'గుయ్' శబ్దం వస్తుంది. ఎవరో సీక్రెట్‌గా మాట్లాడినట్టు విన్పిస్తుంది. ఏమిటో అర్థం కాదు...

సైనస్ ట్రబుల్ వున్నా, బ్లడ్‌ప్రెషర్ ఉన్నా కూడా ఇలా చెవులో ధ్వనులు విన్పిస్తాయంటారు.. మానసికంగా బలహీనులైన వారికి ఇలా గుసగుసలు వినబడ్డం, ఎవరో మాట్లాడుకుంటున్నట్లు వినపడ్డం వినబడుతుందని— దానికి మానసిక శాస్త్ర వేత్తల సలహా అవసరం అనీ యీ మధ్య ఓ ప్రముఖ సైకాలజిస్టు చెప్పగా విన్నాను. డాక్టరుతో ముందు చెప్పండి.

**ఎస్. ఎల్. ఎస్. సికింద్రాబాదు**

మీరుకూడా బొమ్మలతో సహితం జవాబులు ఎందుచేత యివ్వరు?

నాకంతగా బొమ్మలు వేయడం రాదు సోదరీ!

**డి వి కె, విశాఖపట్నం**

ఎదుటివారిలోని తప్పులని స్త్రీలు పట్టినంత తొందరగా పురుషులు ఎంచరు ఎందుచేత?

వాళ్ళు కొంచెం ట్యూబులైట్లు—గ్రహించడానికి వ్యవధి తీసుకుంటారు. అంతమాత్రం చేత తప్పు లెంచరని నిర్ణయించేయకండి.

**ఏ. ఎల్. బెంగుళూరు**

భర్త తాన్ను ఎంత ప్రేమతో చూసినా తల్లితండ్రులనే ఎక్కువగా ప్రేమిస్తుంది. ఇది ప్రత్యక్ష సాక్ష్యం. దీనితో ఏకీభవిస్తారని అనుకుంటాను.

నా విషయంలో అది ప్రత్యక్ష సాక్ష్యం అయినంత మాత్రాన యూనివర్సల్‌గా అంతే అనుకోవడం ఏమిటి?

**ఆర్. డి. ద్రాక్షారామం**

మీ ప్రశ్నావళి శీర్షిక ఏమీ బాగాలేదు. అందులో ఉపయోగమైనవి ఏమీలేవు...

ఉపయుక్తమైన కళలు: జాడీలకు మూతలు. అంటూ వ్రాయించమంటారేమిటి రేడియోవారిలా!. అందరి అభిరుచులకీ ఒకే శీర్షికకాదు. అందుకే పత్రికల్లో పలు శీర్షికలు ఉండడం.

**ఆర్. ఏ. ఆర్, నద్ని (ఎం. పి.)**

మా పొరుగులో ఒక అమ్మాయి ఉంది. ప్రేమంటే భయంలేదు అంది. కాని ఈ అబ్బాయిగారికి భయంగా ఉంది.

భయపడవలసిన పరిస్థితే—ప్రేమిస్తే పెళ్ళాడమంటుందని కబోలు మీ అబ్బాయిగారిభయం. అంతేనా?

**పి. ఎస్. ఆర్. బూర్గులంపాడు**

అక్కయ్యగారూ, హరిశ్చంద్రుని లాంటి సత్యమూర్తులు మనదేశంలో ఉన్నారంటారా?

ఆ ఉండకేం ఉంటూనే ఉన్నారు. కాని సత్యానికే సమయోచితంగా మెరుగులు దిద్దుతూ ఉంటారు.

**ప్రభాకర్, అల్హాబాద్**

తమకు నచ్చినా సమాజానికి భయపడి ఆచరణలో వెనుదీసే పదిమందిలా కాక మనసుకు నచ్చినది, ఇతరులకి హాని కల్గించనిది ఆచరణలో చూపించి లోకుల వ్యంగ్యపు విసుళ్ళకి మీరు సూటిగా నిర్భయంగా మీరిచ్చే జవాబులు పైకి పరదాగా ఉన్నా నిజానికవి చాలా వాడిగా ఉంటాయి. మీ ధైర్యాన్ని, సింప్లిసిటీనీ, అభిమానించే మాలాంటివాళ్ళుకూడా చాలా మంది ఉంటారని తెలుసుకొందుకే ఈ ఉత్తరం రాస్తున్నాను...

నిజమే మీరన్నది— అభిమానులు లేకపోతే చెందుకుంటూ కాలం నెట్టుకు రావడంలో ఆనందం ఉండదు. అయినా నేను అభిమానులకంటె దురభిమానులపట్లే శ్రద్ధ వహిస్తూ ఉంటాను. ఎందుకంటారా? అభిమానులు అపార్థం చేసుకోరు. దురభిమానులు మౌనానికి కూడా విపరీతార్థాలు తీస్తారు.

**పి. వి. ఎమ్. ముగపాక**

రామలక్ష్మిగారూ నాకు మీ వ్యాఖ్యానం నచ్చిందండీ.

ఏం పులిచెర్ల కార్టూను గాని చూశారా?

**ఎమ్. ఎస్. ఆర్, జమ్మలమడుగు**

మీ జవాబులు చూస్తుంటే అసహ్యం వేస్తుంది.

చిత్రం. అలా అసహ్యించుకోతగ్గవి మీలాంటి వాళ్ళు రహస్యంగా చదువుతారు కదా!?

**వి. ఎస్. ఆర్. ఎమ్, కాకినాడ**

మీరు చిన్నప్పుడు కాకినాడలో ఉండేవారు కదా? మీ ఇంటిపక్కన ఉండే రమణ జ్ఞాపకం ఉందా?

ఎందుకు లేదు? రమణ, అనసూయ, అన్నపూర్ణ నేను బుడ్డి అంతా గాంగే కదా! నన్నే తను మరిచి పోయిందేమో.

**ఆర్. హెచ్. ఎన్. విశాఖపట్నం**

మీరు అభ్యుదయ రచయిత్రి గదా మీకు మతంపై నమ్మకం ఉందా?

మీరామాట గట్టిగా అనకండి — నాశత్రువులు సంఘమరణం కోరుకో కలరు!

**సి హెచ్. బి హెచ్, మిర్యాలగూడ**

రామలక్ష్మి గారు మానవుడెప్పుడూ సుఖాన్నే కోరుకుంటాడు. దుఃఖాన్ని ఎందుకు కోరడు?

కోరకుండానే లభ్యం అయేది కదా దుఃఖం? అందుకు.

**పి. వి. ఆర్, గుంటూరు**

మానవుని ధనకాంక్ష ఎప్పటికి తీరుతుంది?

ఇదిగో ఏదో విప్లవం వస్తుందటగా. అది వచ్చేస్తే తీరిపోతుందిట. అందరూ చెప్పుకుంటున్నారు.

**పి. ఎ. ఎస్. డి. ఉనినిపల్లి**

మా శ్రీవారు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటారు. ఏమై ఉంటుంది?

ఏమై ఉంటుందంటూ ప్రాణం విసిగించక ఆ మానవుణ్ణి కాస్సేపు ప్రశాంతంగా ఆలోచించుకోనివ్వ కూడదూ?

**ఎస్. వి. ఆర్. ఆర్, కొల్లాపూరు**

మీ జీవితం నేర్పిన పాఠం ఏమిటో సెలవిస్తారా?

చుట్టూ వ్యక్తులు అరుమకున్నా నీపద్ధతిపై నీకు నమ్మకం ఉంటే తిన్నగా సాగిపోతే— అంతిమ విజయం తథ్యమని గ్రహించాను— యిప్పటి వరకూ. ఒకళ్ళేదో అనుకుంటారనీ, అంటారనీ భయపడ్డానికి స్వస్తి చెప్పాను— అనుభవం నేర్పిన పాఠాలతో—

'ఏమండీ...'

'ఆఁ'

'తయారయ్యారా?'

'ఆఁ, ఆఁ'

'ఆఁ ఆఁ ఏమిటండీ? తయారయ్యారా లేదా? అయిదుం పావవుతోంది. కొత్త సినిమాకదా, టికెట్స్ అట్టేపెట్టి ఉంచేందుకు అక్కడ మీ మావగారున్నారా—ఏం?' అంటూ గదిలోకివచ్చి భర్తను చూసి విస్తుపోయింది వాసవి.

దత్తు సీరియస్‌గా రాసుకొంటున్నాడు.

'ఎలాగండీ మీతో, నేను తయారయి పావుగంట అయ్యింది. అదీ, ఇదీ సర్దుకొనేటప్పటికి మీరు రెడీ కాకపోతారా అని అనుకొంటే, గొంగళిపురుగులా ఎక్కడి వారక్కడే ఉన్నారు. ఏ సమయం లేదు, సందర్భం లేదు. కాస్త ఖాళీ దొరికితే చాలు, తాలూకాఫీసు గుమస్తాలా రాసిపడేస్తుంటారు' విసుగ్గా అంది వాసవి.

రాయటం ఆపేసి, పెన్ను సొరుగులో వడేసి 'ఏమన్నావ్' అంటూ భార్యకేసి తిరిగాడు దత్తు.

వాసవి తళుక్కుమంది తటిల్లతలా. ఆమె ఏదో చెప్తుందిగానీ, వినిపించుకునే స్థితిలో లేడు. పచ్చని ముద్దబంతి పువ్వులాంటి వాసవి మరూన్ బ్రౌన్ చీర కట్టింది. అదేరంగు స్లీవ్‌లెస్ బ్లౌజు వేసింది. నెత్తిమీద బుట్టంత పట్టుగా ముడి చుట్టింది. నుదుట చిన్న తిలకం బొట్టు పెట్టింది. చెవులకు చిన్న సైజు గాజుల్లాంటి రింగులు ... కుడి చేతికి పెద్ద స్క్వేరు రిస్టువాచి. చేతులకు గాజుల్లేవు... ఆధునికంగా అలంకరించుకొంది.

అంత అందమైన భార్య, ఎదుట నిల్చునా, ఏదో అసంతృప్తి అతని గుండెల్లోంచి నిట్టూర్పుగా బయట పడింది. 'ఒక్కసారి వసూ! ఒక్కసారి నాకు నచ్చేటట్లు అలంకరించుకోవూ!' మనసు బరువుగా మూల్గింది—అది వాసవికి వినిపించదు, వినిపించుకోదు.

'ఏమిటా ఆలోచన? ఇవ్వాళ వెళ్ళే ఉద్దేశ్యం లేదా?'

'ఎందుకు లేదు. నీలాగ పెద్ద ముడి చుట్టి, గంట వృధా చేయనక్కర లేదు. ఫౌండేషన్ క్రీములు, ... బాబ్ పెన్సిళ్ళతో



# మార్పు

వై.ముద్దుక్రిష్ణ

కుస్తీ పట్టనవసరం లేదు. క్షణంలో తయారవ్వనూ!' లేచి బట్టలు వేసుకొందికి బీరువాకేసి నడచాడు దత్తు.

'అనుమానమెందుకు? పైజామాలాంటి ప్యాంటు పైన బుశ్‌ఖానాలాంటి స్లాకు. అంతేకదా! ఇంకేవుంది తయారవ్వడం? అరక్షణం పట్టదు మీకు' అంటూ భర్త రాసిం దేమిటో చూసే కుతూహలంతో టేబిల్ వైపు నడిచింది వాసవి.

దత్తు సమాధానం ఇవ్వలేదు. మౌనంగా బట్టలు వేసుకోవటం మొదలుపెట్టాడు.

భర్త రాసింది చదివేక వాసవి ముఖం ఎర్రబడింది.

'హాఁ ఇదే వర్ణన! ఏ కథలో చూసినా మీ హీరోయిన్ ఒకేలావుంటుంది. కాస్త వైవిధ్యం చూపించకూడదూ?'

'ఇప్పుడేవయ్యింది?' స్లాకు బటన్స్ పెట్టుకుంటూ చూసేడు దత్తు.

'ఏమిటావర్ణనా?'...పచ్చని అరుంధతీ బంగారుతీగలా ఎర్రని చీరలో మెరుస్తోంది. నుదుట పెద్ద కుంకమబొట్టు, ముఖానికి మరింత శోభనిస్తోంది. వాల్జడ ముందుకు వేసుకొంది. కాటుక దిద్దుకున్న కళ్ళ చివరినుండి క్రీగంట చూస్తోంది. ఆమె తలలో తురుముకొన్న పెద్ద మల్లెచెండు విరగబడి నవ్వుతూ దానా

స్తోంది...' చదివేవాళ్లకు విసుగెయ్యదూ?'

దత్తు మాట్లాడలేదు. జోళ్లు వేసుకొందుకు ఉపక్రమించేడు.

'ఏముంది! ఒంటిజడ వేసుకొని, తలలో ఓ బుట్టెడుపూలు తురుముకొని, కళ్లనిండా దెయ్యాల్లా కాటుక పులుముకొని, నుదుట మునెలమ్మలా పెద్ద బొట్టు పెట్టుకొని, ఎర్రచీర కట్టుకోకపోతే ఆడది కాదా? వీటితో మాత్రం ఆపేసారేం? జడకు జడగంటలు, తలలో నాగరం, చెవులకు జూకాలు, కాళ్లకు పట్టాలు, చేతులునిండా ఎర్రని గాజులు, ముఖానికింత పసుపూ—ఇలా రాసుకొంటూ పోలేకపోయ్యారా పల్లెపడచులాగ...'

'వాళ్లంతా బావుంటారు' మధ్యలో అన్నాడు దత్తు.

'అంటే, నేను బాగుండననా, లేక నన్ను వాళ్లలా ఉండమనా మీ ఉద్దేశ్యం' ఉక్రోషంతో ఎర్రగా పొంగింది వాసవి ముఖం.

'నీ అందం వేరు. నువ్వు వాళ్లలా ఎలా ఉండగలవు వసూ? ఎమ్మే చదివిన దానివి కదా?'

'మరి పల్లెటూళ్ళకి కొదవేముందని నన్ను కట్టుకొన్నారు?'

'నువ్వు వెంటబడితే...'

'అంటేమాత్రం మీకు ఇష్టం లేకుండానే కట్టుకొన్నారా చెప్పండి?' ఉచ్ఛ్వాస

# మార్పు

నిశ్వాసాలు వేడిగా, వాడిగా సాగుతున్నాయి. సూటిగ చూస్తోంది వాసవి. దత్తు నవ్వేడు. 'ఇష్టపడే చేసుకొన్నాను. కాదంటం లేదు. ముందు నువ్వే ప్రపోస్ చేశావు. మా వాళ్లద్వారా మంతనాలు జరిపించేవు'

'ఒద్దనాల్సింది'

'ఎలా అంటాను?! వివడనగలడు!! మిస్ యూనివర్శిటీవి, బంధువు అమ్మాయివి, పైగా నిన్ను చూడగానే ప్రేమించాను...'

'అందం కావాలి మనసు చూడరు, ప్రేమించేనని కబుర్లు చెప్తారుకానీ. నా కోసం కొంచం మారాగా?'

'ఎందుకు మారాలి?'

వాసవి దెబ్బతింది. కొరకొరాచూసింది.

'పెళ్లాన్ని గనక'

'మొగుడ్నికదా, నా కోసం కట్టూబొట్టూ ఒక్కసారైనా మార్చావా?'

'నేనెందుకు మార్చాలసలు? కాలంతో పాటు మనుషులు మారాలి. నేను కాలానుగుణంగా ఉన్నాను. మీలా కొన్ని దశాబ్దాల వెనక లేను. మనం ఉన్న సమాజానికి అనుగుణంగా కొన్ని అలవాట్లు పద్ధతులూ మార్చుకోవాలి. ఏ ఫంక్షన్‌కు వెళ్లినా, లొడలొడా ఆ పైజమా లాంటి పాంటూ బుష్‌షర్టూ కాకతప్ప మరోటి వేసుకోరు. అందరిలా సూటు వేసుకొంటే ఎంత బావుంటుంది! కనీసం టక్‌చేసి టై కడితే చాలును' క్షణం ఆగి, మళ్లీ అంది. 'మీరు వెనక్కి రమ్మంటున్నారు నన్ను. మిమ్మల్ని ముందుకు రమ్మంటున్నాను నేను. ఏది సమంజసం?'

దత్తు నోరు విప్పలేదు.

వాసవి ఆగలేదు. 'కాస్త మోడరన్‌గా ఉంటే ఏం పోయింది? పేరు కూడా అంతే దత్తాత్రేయుడట'

'బావుంది. పెళ్ళయినతర్వాత జరిగిందేమిటి నా బాగసాల? అసలు పేరు నచ్చనప్పుడు పెళ్లాడక పోవల్సింది.'

'పేరు చూసికాదు మిమ్మల్ని పెళ్లాడింది మీ ముఖాన్ని చూసి...'

'ఒక తగువెందుకు? ముఖం కావలిస్తే, నేను ఏ డ్రెస్ వేసుకుంటే నీకేం? పేరేదైతే నీకేం?'

'మనిషికి పర్సనాలిటీ ఒక్కటేనా కావాల్సింది? మరేం అక్కర్లేదా? అయితే బట్టలు విప్పుకొని తిరగండి చూద్దాం. నా ఫ్రెండ్స్ అంతా అంటారు. మీ వారెగ్జ్ ఆఫీసరుకదా, అంత చక్కని పర్సనాలిటీ ఉందికదా, ఏమిటా డబ్బా సొరుగ్గా, చక్కా నేరో పాంట్లో టక్‌చేసి టై కట్టుకొని పాయింటెడ్ షూ వేసుకొని టకటకా నడవక? మాటల్లో ఒక్కసారైనా మార్లేదు, అని'

'వాళ్లెందుకు చూడాలసలు? అంత కోరిక పీడిస్తే ఆలాంటి మొగుళ్లనే కట్టుకొని రోజూ చూస్తూ కూర్చోమను. నాకెందుకో ఇష్టంలేదు. నేను వేసుకోను.'

'మరి నన్నెందుకు మీకు ఇష్టంవచ్చినట్టు అలంకరించుకోమని శాసిస్తారు?'

'శాసించేనా వసూ, అర్థిస్తున్నాను గానీ!'

'ఒరేయ్ మొగుడా, ఏమోయ్ మొగుడూ', అని మొగుడ్ని పెళ్లాం ముద్దుగా పిల్చే ఈ రోజుల్లో, శాసిస్తే ఏ పెళ్లాం ఊరుకొంటుంది? నాకు ఇష్టం కాబట్టి, అప్పుడప్పుడైనా అలా అలంకరించుకొనమని అడుగుతున్నానంతే!'

'నేనూ అంతే!'

'నువ్వుచెప్పిన ఆ ఫోల్స్‌లెస్ నారో పాంటూ, పాయింటెడ్ షూ, ఇవన్నింటిలోకి మారాలి అంటే అంత సులభమా,



కాదు నాకు. నువ్వు ప్రణయంలో నేను చెప్పి నట్లు చేసేవు. ఎంతో ముచ్చటపడి ఎర్రచీర కొన్నాను. ఆ శనంలో మల్లెలు తెచ్చాను. గుర్తుందా? (కిందటేడు ... పెళ్ళయిన సరిగ్గా ఏడాదికి ... మారేజి యానివర్సరీ అని ముచ్చటపడి తెచ్చాను. నా కోరిక నిర్దాక్షిణ్యంగా త్రోసేవు. ఆ చీర మీ వదినకు పంపావు...'

వాసవి బుసలు కొడుతోంది. 'అవును త్రోసిపుచ్చాను. నిర్దాక్షిణ్యంగా మీ కోరిక కాలదన్నాను. అదేనా మీకు గుర్తున్నది? మీ పుట్టినరోజున మీకు మా, రెడీమేడ్ ఫారెను షర్టు కొని తెస్తే తీసుకొన్నారా—పాపం? 'నన్ను బలవంత పెట్టకువమ్మా' అన్నారు. ఒక్కసారైనా కట్టించుకొమ్మని పెళ్ళయిన దగ్గర నుంచి పోరుతూనే ఉన్నాను. కుందేలుకు మూడేకాళ్ళని కూర్చున్నారు. ఎనిమిది

# మార్పు

వందలు జీతం తెచ్చుకొంటున్న ఆఫీసరు, కారు, చక్కనిమేడ అందమైన పెళ్ళాం ఇవన్నీఉండి కాస్త మోడరన్‌గా ఉంటే తప్పేమిటి? ఎవరు ఆక్షేపిస్తారు? భార్య కోసపుకోరిక తీర్చటంకూడా కష్టమేనా? మొదటి రాత్రి ఎన్నికబుర్లు చెప్పారు 'నీ మాట నే నెన్నడూ కాదనను వసూ' అన్నారు. 'నువ్వే నేనన్నారు, నవే నువ్వన్నారు అన్నీ నిజం అనుకొన్నాను ఎంతో గర్వించాను. హు భార్యను మంత్రం వేయటంలో ఘటికులు మీ మగాళ్ళు. మగాళ్ళ కబుర్లకి, బెలూన్ లాగా ఉబ్బిపోయె మనస్తత్వం ఆడాళ్ళ కెందుకిచ్చాడో దేవుడు! బెలూన్‌లాగ పొంగించి టప్పుని పేల్చేయటానికే కాబోలు! నా ఒక్కగానొక్క కోరిక తీర్చటం లేదుమీరు.'

'నా మనసు వ్యతిరేకిస్తుంది వసూ!' మెల్లగా అన్నాడు దత్తా.

'నాకు మనసు లేదేటి మరి?' గట్టిగా అరిచింది వాసవి.

'కాదన్నానా? ఇద్దరికీ తలఒగ్గని వ్యక్తిత్వం ఉంది. అందుకే ఈ సమస్యకు పరిష్కారం కుదరటం లేదు వసూ. పోనీయి ఇలా వాదించుకుంటూ పోతే దానికి అంతం ఎక్కడ?! పద టైం అవుతోంది...' వాసవి కిమ్మన లేదు ఆమెకు నిరీతమైన కోపం వచ్చినట్లు ఆమె చెక్కిళ్ళే చెబుతున్నాయ్. అంత కోపంలో ఆమె ఛస్తే విడిపించుకోదు ఇంకో విషయమైతే. కాని సినిమా ఆమెకు ఆరో ప్రాణం. అందుకే 'పద' అనగానే అప్రయత్నంగా లేచి నుంచుంది. వాచీ చూసుకుంది. 'ఆరయింది, ఇంకేం సినిమా' అని గొణిగింది 'ఫర్వాలేదు, టికెట్లు తీసుకొన్నాను.' అంటూ బయటకు నడిచాడు దత్తా.

'చెప్పలేదేం!' అన్నమాట ఆమెగొంతులోనే పూడుకుపోయింది. ఇంకొకప్పుడైతే అలిగి బ్రతిమాలించుకునిగాని బయలు దేరేదికాదు కోపంవల్ల మాట్లాడేందుకు మనస్కరించక మౌనంగా అనుసరించింది.

* * *

కారు పోతుంది.

ఎవ్వరూ మాట్లాడటం లేదు. వివరి [illegible]తో వారు సీరియస్‌గా ఉన్నారు.

వాసవి హృదయం ఉడికిపోతుంది భర్త కేసి చూడటంలేదు. ఎందుకో ఈరోజు మరీ చిరాగ్గా ఉంది. ఆప్లాకు, ఆ పైజమా ఫాంటు చూస్తుంటే. అందుకే అతనికేసి ముఖం తిప్పకుండా రోడ్డువైపు చూస్తూ కూర్చుంది ఎటుచూసినా నారోఫాంట్లు వేసినవాళ్ళే! టక్ చేసినవాళ్ళే! ఎంత స్మార్టుగా ఉంటాడు! ఈయనకే మొచ్చిందసలు? 'వాళ్ళెంత స్మార్ట్‌గా ఉన్నారో' అంది వాసవి తనకుతాను మాట్లాడు కొంటున్నట్లుగా.

అటువైపు చూసాడు దత్తా. సుర్వాలాంటి పంట్లాలు. బొమ్మల చొక్కాలు టక్‌చేసి, బైనెట్ లాంటి పాయింటెడ్ షూలతో టకటక మిలటరి వాళ్ళమాదిరి నడుస్తూ వస్తున్నారు [illegible].

'మైగాడ్! ఆ ఫంట్లెలా తొడిగారో! నెహ్రూ సుర్వాల్లా ఉన్నాయి?' వాసవికి ఒళ్ళు మండింది. కోపంతో మాటలురాక మౌనం దాల్చింది కాసేపు. సమాధానం చెప్పకుండా ఉండటం ఆమె [illegible] కాలేదు. 'నేను మరీ అలాంటివి వేసుకొమ్మనటం లేదు. కాస్త నారో చేయించుకొమ్మంటున్నాను' అంది.

దత్తా సమాధానం చెప్పదలచుకోలేదు. చెబితే కారునడవదని తనకి తెలుసు. ఇప్పటికే ఆమె కోల్డ్‌వార్‌లో ఉంది. ఏమాత్రం కదిపినా ప్రమాదం సంభవించవచ్చు. కానీ, అలా ఎంకోసేపు ఓపిక పట్టలేకపోయాడు. కామెంటు చేయకుండా ఉండనివ్వలేదు లోపలి జీవుడు. 'మాటిమాటికీ అలా పైటలు సవరించుకోకపోతే, కాస్త పొడుగుపైట వేసుకోరాదూ ఈ ఆడాళ్ళు? ఒక అంగుళం పైట భుజాన పడేస్తారు. ఎందుకొచ్చిన పైటరాబాబూ అన్నట్లు. ఏం ఫాషనో!!'

'కారాపండి' అంది వాసవి హఠాత్తుగా.

'ఇంకా థియేటరు రాందే' అన్నాడు దత్తా కారాపకుండా'

'అక్కర్లేదు — నేను వెళ్ళిపోతాను'

'అదేం—?ఏమయ్యింది వాసవి?'

'నామనసు బాగోలేదు. తలనొప్పిగా ఉంది. ఆపుతారా— లేదా?' కారాపాడు.

దత్తా భార్యవంక చూశాడు. చిటపట లాడుతుంది ఆమె.

'కోపం వచ్చిందా?'

'మంటపెట్టి మండించాం.?' అని అడగుతారేం నంగనాచిలా. మూడ్ పూర్తిగా చెడిపోయింది. నేను సినిమా చూళ్ళేను.'

'నువ్వు లేకుండా నేనూ చూడలేను ఎక్కడికి వెళ్దాం మరి?'

'వల్లకాట్లోకి'

'నాకు భయం'

'నన్ను విసిగించవద్దు. ప్లీస్! ఐవాంట్ టు గో హోమ్'

సీరియస్‌గా అంది వాసవి.

దత్తా మౌనంగా కారు తిప్పాడు.

* * *

వాసవి ఎమ్. ఎ. రెండు జడలు వేస్తుంది రకరకాల ముడులు వేస్తుంది. పొరపాటునైనా ఒక్కజడ వేసుకోదు. ఆమెకు ఇష్టం లేదు. దత్తాకు ఇష్టం. స్లీవ్‌లెస్ వేస్తుంది. దత్తాకి నచ్చదు. ఆమెకు ఎర్రచీర అన్నా, కళ్ళకు కాటుక పెట్టడమన్నా, జడలో పూలు తురుము కోవటమన్నా చిరాకు, అవంటే దత్తాకు మోజు.

దత్తా ఎమ్. ఇ., టక్ చేసుకోడు సూటు వెయ్యడు. నారో ఫాంట్లు, ఫోల్డ్ లెస్ ఫాంట్లు, చుంచుమూతి బూట్లు అంటే అసలే అసహ్యం. పీటలో మొగుడ్ని చూడాలని వాసవి తాపత్రయం.

ఈ విషయంలో చిటపట చినుకులు పడిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. దంపతులన్నాక సహజం. కాని కాస్త ఉధృతంగా పడటం ఇదే మొదటిసారి.

అందుకే ఇద్దరి మనసులూ కాస్త ఆందోళన పడుతున్నాయి. అయినా ఎవ్వరూ బయట పడలేదు, పడదలచుకో లేదు.

వాసవి మాట్లాడలేదు, అతను పలకరిస్తే బావుణ్ను అనుకొంది.

దత్తా పలకరించలేదు, ఆమె మాట్లాడితే బావుణ్ను అనుకొన్నాడు.

ఎడమొహం పెడమొహం అయిపోయారు.

భోజనాలు అయ్యాక దత్తా ముందే మంచమెక్కాడు.

వాసవి మనసు గుబగుబ లాడింది. తనే

# వారఫలం

**19-2-1971 శుక్రవారం మొదలు**
**25-2-1971 గురువారం వరకు**

**మేషం:** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్య భారం పెరుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సంతోష కరమైన వార్తలను వింటారు.

**వృషభం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది.

స్త్రీలకు.— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం.** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరగలదు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేరికి రాగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య.** వ్యాపారంలో సాటివారి పోటీ తగ్గుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:—బంధు మిత్రులను కల్సుకొంటారు. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల** సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మీ మంచితనమే కొన్ని వ్యవహారాల్లో ఇబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు:— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారులు వలన జరుగ వలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా వుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు.** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. అధిక వ్యయం జరుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా [illegible]

**మకరం:** మీ ఆలోచనలు లాభ దాయకంగా వుంటాయి. నూతనవిషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో మీ ఆలోచనలు మార్పులు పొందవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు:— దైవ కార్యాలు నెరవేరతాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**మీనం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సు కొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్




### జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ల ముద్దుల మరదలు సుధ. సుధ కుంటిపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు. ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కనిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ హాస్య సర్వరీకి విశాఖ చెప్తుంది. తను ప్రేమించిన నళినితో మురళి వివాహం జరుగుతుంది. మంచి డాక్టరనిపించుకోవాలని, లక్ష్యాన్ని సాధించాలని రఘు కోరిక. ఉద్రేకపెట్టిన రాధ ఆకర్షణనుంచి తప్పుకుంటూ మనసు లక్ష్యంవైపు కేంద్రీకరిస్తుంటాడు రఘు.

## 9

'నా సుధేనా ఈ మాట్లాడుతూన్నది?' అనుకుని ఆశ్చర్యపోయాడు రఘు. ప్రపంచ జ్ఞానం ఇంకా సరిగా కలగలేదని తను అనుకుంటూండే ఆ సుధ హృదయంలో ఇంతింత గంభీరమైన భావాల్ని వదిలపరచ బడున్నందుకు విభ్రాంతుడౌతూ—

'పోనీ నీ తత్వాన్నిబట్టే ముందు మాట్లాడుకుందాం మరి. ఈ భావంతో వున్న నువ్వు నీ భవిష్యత్తుని ఏవిధంగా నడిపించుకుందుకు నిశ్చయించావ్?' అన్నాడు కొంతసేపు నిశ్శబ్దానికి తరవాత రఘు.

'చెప్పాగా, ఈ మాత్రం తెలివి ఇచ్చింది కూడా ఆ భగవంతుడికి కృతజ్ఞతలర్పించుకో గలనని.'

'సరి అయితే, నా ముందు జీవితాన్ని గురించి?'

'అది నువ్వు నిర్ణయించుకోవలసిన విషయం బావా' నేర్పుగా బదులిచ్చింది సుధ.

'అయితే నా భవిష్యత్తుని గురించి నీ కాలోచనే లేదన్నమాట.'

'అదేంమాట బావా. నేను ఒక రోజులో ఎక్కువ కాలాన్ని ఎవరిగురించి ఆలోచిస్తాను అంటే, అది నీగురించే!— చెప్పానుగా ఒక అపూర్వసుందరి—'

'రాధని చేసుకోవచ్చా!...' అనుకోకుండా ఎలా వచ్చిందో, అతని నోటివెంట వచ్చేసింది ఆ పేరు.

'రాధనా?' నాన్చింది సుధ.

'ఏం. నువ్వు ఊహించే చక్కదనం ఆవిడలో ఉందేమోనే?'

'ఉందిగాని అంతరంగిక సౌందర్యం బాగా లోపిస్తుందేమోనని నా కనుమానం అనిపిస్తూ వుంటుంది బావా. అందువల్ల ఆవిడతో నీ జీవితం అంత సుఖంగా సాగదేమోనని నా భయం' అంటూ తలెత్తి రఘువేపు చూసిన సుధ 'ఒకవేళ నువ్వావిణ్ణే చేసుకుందుకు నిశ్చయించి గనక వుంటే నన్ను క్షమించు బావా' అంది అతని తీరుమచూశాక మళ్లీ.

'అబ్బే, నీ అభిప్రాయం ఒకవేళ అలా వుందేమో నని అడిగానంతే' అంటూ కొంత ఆగి ఆలోచించుకుని '... పోనీ నీకు తగ్గట్టు నిర్ణయించుకున్న ఆ నిర్ణయాలేవో నాకు చెప్పకూడదా సుధా' అన్నాడు ప్రేమంగా.

'నీతో చెప్పకూడని మాటంటూ నా కెప్పుడూ లేదు బావా'

'మరి చెప్పు నీ భవిష్యత్తు—'

'హు. అంటే నువ్వు బాధపడతావేమోనని ఇంతవరకూ నీతో అనలేదుగానీ నాకు భవిష్యత్తంటూ గొప్పగ ఏం వుంది బావా, ఏదో మనిషిగా పుట్టినందుకు దైవం నా కిచ్చిన ఆయుర్దాయం ఉన్నంత వరకూ —'

'సుధా?' మందలించాడు రఘు.

'అందుకే బావా నే చెప్పనన్నదీ!'

'ఏమిటంపిది నీ కింత నిస్పృహ దేనికి సుధా' లాలనగా అడిగాడు మళ్లీ.

'నిస్పృహ కాకుండా ఏంవుంది చెప్పు బావా, నా జన్మ నాకే అవమానంగా వుంటూందంటే ఇక నన్నుగురించి బంధువులకి మాత్రం అవమానాలు కాదూ, అయినామాత్రం ఏం చెయ్యడం బావా ఎన్ని ఏవగింపులు వచ్చినా జీవితాన్ని సాగించి తీరాల్సిందే దా.'

'సుధా, ఇంతవరకూ నాకు తెలిసినంతవరకూ నీ మనసుకి బాధ కలిగేటువంటి పొరపాటు ఎప్పుడూ ఎవ్వరూ చెయ్యలేదే' అంతవరకూ బాధగా కళ్లు మూసుకున్న రఘు అన్నాడు.

'లేదు బావా — అలాంటి లోపం నా కెన్నడూ, ఎప్పుడూ చెయ్యలేదు. అయినా ఎల్లకాలం ఇలాగే వెళుతుందన్న నిజమేమిటి బావా, ముందు ముందు ఎన్నెన్ని మార్పులు రావచ్చు.'

'నీ బాధ నా కిప్పుడర్థమయింది సుధా! ఇప్పుడు నాన్నా రేపు నీకీ, పెళ్లిళ్లయితే వాళ్లిద్దరూ నిన్ను లోకువ చేసారేమో నన్న భయం నీకు బాగా వున్న దనుకుంటా, అంతేనా' అన్నాడు రఘు.

'నువ్వు ఊహించినది కొంతవరకూ నిజమే గాని, నా భయానికి కారణం మాత్రం అదికాదు. ఒకవేళ వారు నన్నలా చులకన చేసినా, అసలే నేను లెఖ్ఖచెయ్యను బావా, అయితే—'

'చెప్పు సుధా' హెచ్చరించాడు రఘు.

'ఇప్పుడు కాదు ఎన్నాళ్ళబట్టో నీతో ఈ విషయాన్ని గురించి చెప్పి నా కోరిక చెల్లించవలసిందిగా అర్థించాలనే నా

ప్రయత్నం కూడా బావా? అయితే నా మనసులోని బాధ నీ కర్థమయ్యేటట్టు ఎలా చెప్పాలో, అది తెలియడం లేదు.' ఎటో చూస్తూ దిగులుగా అంది సుధ. సుధ గొంతుక వణకడాన్నిబట్టి ఆ హృదయం పడుతూన్న యాతనని గ్రహించిన రఘు, అతని హృదయం కూడా మరొక విధంగా బాధపడసాగింది. 'ఇన్నాళ్ళబట్టీ తను 'లక్ష్యమా' 'సౌఖ్యమా' ఈ రెండిట్లో ఏది తనకి ముఖ్యమైనదో తేల్చుకోలేక సతమతమౌతూన్న ఆ సమస్యకి పరిష్కారంగా వుండదుగదా సుధ కోరిన యీ కోరికా!'

'నీ అభ్యంతరం లేకపోతే, నిన్ను చూసుకుంటూ నీ సాన్నిధ్యంలోనే నా కాలాన్నంతా వెళ్ళబుచ్చేటట్టుగా వరం ప్రసాదించు బావా' ఇదే నా కోరిక. కింద చతికిలబడి కూర్చున్న సుధ, పడక్కుర్చీలో కూర్చున్న రఘువళ్ళో తన మొహం దాచుకుంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

'సుధా! సుధా? అబ్బ ఏమిటీ పిచ్చితనం సుధా.' అంటూ ఆప్యాయంగా సుధ తల నిమిరి, లేవదీసి సరిగ్గా కూర్చోపెట్టాడు రఘు.

'నీకా భయం ఎప్పుడూ వద్దు సుధా. నా సాన్నిధ్యంలో మాత్రం ఏమిటి నా హృదయంలోనే శాశ్వతంగా నీకు స్థానం వుంది' అని సుధని ఊరడించాలని అతని మనసు తహ తహ పడింది. అయితే, ఇందుకు పూర్తిగా వ్యతిరేకానికి ఈడ్చేటట్టున్న తన పరిసర పరిస్థితులూ, తరుచు దిగజారేందుకు చూస్తూన్న తన మనో నిబ్బరం పట్ల అలజడితో తన స్థిరత్వంమీద తనకే నమ్మకం లేనందున, తొందరగా ఇలా మాటివ్వడం ఉభయత్రా తరవాత ఇబ్బందులకి కారణం అవుతుందేమోననుకుని దూరాలోచన గల రఘు అలా తొందరపడలేదు.

'అబ్బ నా స్వార్థంకోసరం నిన్ను నొప్పించినట్టున్నాను' అంది మొహం కళ్ళూ తుడుచుకుంటూ.

'లేదు. నువ్వు బాధపడకు సుధా. నేనింత దీక్షగా ఈ పరిశోధన్నని జరుపుతున్నానూ అంటే, అది నిన్ను అందరివంటిదానిగానూ చేసి, నీ భవిష్యత్తూ అందరితోపాటూ హాయిగా జరిగేలా చెయ్యాలన్న పట్టుదలవల్ల తప్ప మరో కారణం లేదు సుధా. అంతేకాదు నిన్ను దృష్టిలో వుంచుకుని నే ప్రారంభించిన ఈ పరిశోధనవల్ల నీ విషయంలో సంతృప్తి కల్గిందంటేనే ప్రజాక్షేమంకోరి ఈ పరిశోధన్ని ఇంకా పైకి సాగిస్తాను. లేదంటే నా ఉత్సాహం నా ప్రయత్నం ఇంతటితో సరి. తెలిసిందా అందువల్ల నాకు వీలైనంత వరకూ నీకే పథమైనా లోపమూ రానివ్వనూ అని మాత్రం అన్నాడు రఘు తన చేతి రుమాలుతో సుధ కన్నీరు తుడుస్తూ.

'ఈ ఆదరం నాకు చాలు బావా, ఏదో కట్టుతెంచుకు వచ్చేసింది బాధ' అంది వెనక్కిజరిగి ఎప్పటిలా కూర్చుంటూ సుధ.

'మంచిదే సుధా. ఈ నిమిత్తంగా ఒకరి అభిప్రాయం ఇంకొకరు తెల్సుకోగల్గాం' ఇద్దరిమనసూ కొంత తేలికపడ్డ



ట్టాయి రఘు ఆపరేషన్లో పూర్తికాలేదు డంలో నిమగ్నుడైతే సుధ మళ్ళీ అల్లి కలోకి మనసు మళ్ళించింది.

ఈ లోగా బయటికెళ్ళిన వారంతా తిరిగొచ్చేశారు. అంతా ఆ పెళ్ళి విష యాల్ని ముచ్చటించుకుంటూంటే శాంత మాత్రం సుధ మొహాన్ని సూటిగాచూస్తూ పైకెళ్ళి పోయింది.

'మా సుధ నోట్లో వేలుపెడితే కర వడంకూడా తెలియదంటూ అప్ర మానం వాతో వాదిస్తూంటారే. చూశారా?'అంది రాత్రి భర్తతో హాస్యంగా శాంత.

'ఏం? నీ వేలుగాని కరిచిందా? ... భార్య అందించిన కిళ్ళీని నోట్లో పడేసు కుంటూ హాస్యంగా అన్నాడు రామం. తను కూడా.

'నా వేలు కొరికితే ఆ పిల్లకేం లాభం గనక. అందుకే కొరకవలసిన వారి వేలే కొరికుతుంది' అంది పావకాశంగా మంచంమీద కూర్చుంటూ.

శాంత ఎవర్ని మనసులో వుంచుకుని ఇలా అంటుందో గ్రహించిన రామం ఏమి బదులివ్వకుండా ఊరుకున్నాడు.

'అయినా చంద్రుణ్ణి పీడించే రాహుకే తువుల్లాగ మన రఘు ప్రాణానికీ ఈ కుంటి దెక్కడ దాపురించిందండీ.'

'శాంతా' మాటమధ్యనే గద్దించాడు రామం.

# అతని ఆదర్శం

'హా యమ్మో ఆ అభిమానపు మేన మరదల్నసేసరికీ రోషం వచ్చిందిగావల్ను పాపం' ఈర్ష్యగా అంది శాంత.

'లేకపోతే కుంటిదీ లవొద్దని నీకిది వరకు ఎన్నిసార్లు చెప్పలేదూ, పైగా ఉపమానాలుకూడానూ. ఆ చదువు సంధ్య ల్లేని తెలివికి నోరుమూసుకూర్కోక' చీద రించుకున్నాడు రామం.

'ఆ! చీటికీ మాటికి ఈ చదువురాని తనాన్ని దెప్పొద్దని నేనూ ఎన్నిమార్లో చెప్పాను మీకు.'

'లేకపోతే మా పాలిటి మహాలక్ష్మిగా వచ్చిన సుధని దుష్టగ్రహాల్తో పోల్చడ మేమిటే నువ్వూ.'

'అబ్బా అంత మహాలక్ష్మి అయితే మీ ఇంటికోడలిగానే చేసేసుకోరాదూ.'

'తప్పకుండానూ. అయితే ఆ నిశ్చయా నికి రావలసిన వాడు నూ రఘు కాని నేకాదుగా.'

'ఆహా. మీరేగనకైతే తప్పకుండా చేసు కునే వుండేవారన్నమాటే.'

'మహారాజులాగ. ఏం ఏదో కాస్త రూపం తప్ప మిగతా అన్నీ లోపాలే అయిన వాళ్ళ తోనే సర్దుకుపోతూన్నవాణ్ణి, కాస్త రూపంలో తప్ప మిగతా ఏ లోపమూ లేని వాళ్ళతో ఎందుకు సర్దుకోలేనూ' శాంత వేపు కొంటెతనంగా చూస్తూ అన్నాడు.




నరే. పాసం పీకలాగ చేయదాటి పోయింది గనక నేనిప్పుడు చెప్పేదీ మీ తమ్ముడుగారిమాటే' అంది మళ్ళీ అసలు కథలోకొస్తూ.

'ఏమో. ఒకవేళలా చేసుకున్నా చేసు కుంటాడేమో. వాడు గనక నిజంగా అలా చెయ్యగలాడంటే అందుకు నేనెంతన్నా అభినందిస్తాను.'

'చాల్లెండి. ఒకవేళతనా ఉద్దేశంతో వుంటేకూడా వారించడంపోయి అభినం దిస్తారుట, అభినందనలు. చక్కగా ఆ రాధనే అమ్మాయిని చేసుకుంటే ఎంత పొంతనంగా వుంటుందీ.'

'ఆ ఆ రాధని నిన్నూ విగ్రహాల్లా చూసుకుంటూ మా పిన్నిచిన్నాన్న మేమూ నిల్లకాలం ఆరాధించుకుంటూ వుండొచ్చు. 'అదేం ఖర్మో ప్రపంచమంతా ఒక దోవైతే మీ కుటుంబంలో వాళ్ళదిమాత్రం మరోదోవ. అంతా అందమైన వాళ్ళ కోసరం పాకులాడితే మీ ఇంట్లో ఆ అందాన్నంతా ద్వేషిస్తారు. హు మను షుల్లో రసికత్వమంటూ వుంటేగా కొంచె మన్నానూ' విసుక్కుంది శాంత.

'అలాగంటే నే వొప్పుకోను. మాకు కావలసినంత రసికత్వంవుంది. అయితే మా రసికత్వమంతా స్థిరంగానూ న్యాయం గానూ ఉండే అంతరంగ సౌందర్యంమీద మాత్రమే' గొప్పగా మొహం పెడుతూ అన్నాడు రామం.

'ఏమిటో ఆ అంతరంగ సౌందర్యా లంటే' మూతి విరుస్తూ వీరసనగా అంది శాంత.

'అవా. ఉన్నతమైన ఆలోచనలూ ఉదారభావాలూ—'

'ఆ అర్థంమాల్న మాటల్తో చెప్పక పోతే మామూలుగా చెప్పరాదూ.'

'ఇవన్నీ విడమరిచి చెప్పినా ఒకేసారి నీ కర్థమైపోవు శాంతా. ఇటువంటివన్నీ కొంత అనుభవంమీదా, కొంత లోకజ్ఞానం వల్లా, విద్యాజ్ఞానంవల్లా, స్వతహా మొదట్నుంచీ రావాలి ఒకేమాటు. పట్టుబడేవి కాదు. రఘు చిన్నవాడూ లోకజ్ఞానం తెలి యనివాడు కాదు సరికదా, మా అందరి కన్నామారదృష్టి కలవాడుకూడా తెలిసిందా'

'అవును అయినా మీరంతా ఆపిల్లని నెత్తిన పెట్టుకుని ఊరేగుతూంటే తనూ

ఏదో గొప్పగా అనుకుంటున్నాడు ఇంతకీ. ఏదో తిండికి చేరాం—'

'శాంతా' అరుస్తూ చెయ్యెత్తాడు రామం.

'అబ్బ. ఏమన్నానని. మీ కంత ఆవేశం?' తగ్గింది శాంత.

'ఇంకా ఏమనాలి...నిజం చెప్పాలంటే సుధవల్ల మనమే తిండికి చేరాం తెలిసిందా. ఈ కంపెనీకంతా హక్కుదారాలు సుధ. సుధవద్ద పనిచేసే జీతగాళ్లం మేమంతాను. అందువల్ల ఇకమీదటన్నా నీ నోరు అదుపులో వుంచుకో. తెలిసిందా?'

'ఏమో. ఈ కుంభకోణాలన్నీ మాకేం తెలుసూ...' నిజంగానే శాంతకి ఈ వివరాలన్నీ తెలియచెప్పలేదన్న సంగతి అప్పటి వరకూ గుర్తురాని రామం, అయితే ఈ తప్పు తనదే అనుకుని కాస్త శాంతించాడు.

'అంటే నీకీ సంగతులేవీ తెలియవన్న మాట...అంతేనా' సావధానంగా అడిగాడు.

'మీరెప్పుడన్నా చెపితేగా? ఎంతసేపూ తప్పులు పట్టడం తప్ప. అయితే ఈ కంపెనీ మీ మామయ్యదన్నమాట...' అంది శాంత సర్దుకుంటూ.

'కాదు నా బాబయ్య ఆ కంపెనీలో ఓ చిన్న ఉద్యోగంలో వుండగా యజమాని తన స్వదేశం వెళ్లిపోతూ అమ్మకం పెట్టాడు. సరిగ్గా ఆ సమయకాలంలోనే వచ్చిన మా అత్తయ్య తన [illegible] నగలూ వస్త్రాలన్నీ అమ్మించి బలవంతంగా మా బాబాయిచేత ఆ కంపెనీని కొనిపించింది. ఆవిడ హృదయం మంచిది, మా అదృష్టమూ బాగుంది గనక ఒకటికి పదింతలుగా వర్ధిల్లింది కంపెనీ.'

'అబ్బా అయితే మీ అత్తయ్యకి ఎంత అనుభవం వుందన్నమాట.'

'సరిపోయింది. ఆరోజుల్లో ఈ కంపెనీ అభివృద్ధి కొచ్చేటంతవరకూ డైరెక్టర్‌గా పనిచేసి కుటుంబానికి సాయపడ్డది అవిడేగా. ఎం. ఏ. ప్యాసయిందావిడ.'

'ఎవరూ? ఈ అత్తయ్యగారే?'

'ఆ అదొక్కటేకాదు. ఇంకా ఎన్నెన్నో ఉపయోగకరమైన చేతిపనులన్నీ వచ్చు నావిడకి. ముఖ్యంగా ఒక్క క్షణం కూడా కాలాన్ని వృధా చెయ్యదు. ఇప్పుడు తెలిసిందా. అంతరంగ సౌందర్యమంటే ఏమిటోనూ.'

శర్మగారు వాకబు చేయించినట్టూ, అందులో ఒకటి రెండు సమ్బంధాలు డబ్బుమీది మమకారంకొద్దీ, ఒప్పుకునే టట్టున్నట్టూ విన్న రఘు—

'ఏమిటత్తయ్యా సుధకి పెళ్ళిచేసే సెయ్యాలని చాలా ఆత్రుత పడుతున్నావట. ఏంత తొందరొచ్చిందనీ,' అని తిన్నగా జానకినే అడిగేశాడు రఘు.

'తొందరపడడం అంటే—ఎప్పటికనా చేయ్యాల్సిందే గదానని' — చేతుల్నలుపు కుంటూ నాన్చింది జానకి.

'నువ్వుకూడా ఈ ధోరణిలో మాట్లాడ్డం నాకేమీ నచ్చడంలేదత్తయ్యా. రాత్రి ఏలాగో భోజనం చెయ్యాలిగదానని, ఆభోజనం ఇప్పుడే చేసెయ్యగలవా చెప్పు.'

'అలా అనకు బాబూ. సుధకి పంతొమ్మిది నిండుతున్నాయిగా.'

'అయితేమాత్రం ఒక్క పెళ్ళి తప్పితే, మనం చెయ్యాల్సిన పనులు వేరే ఏవీ లేవా, అని.'

'లేకేం. ఎన్నెన్నో వున్నాయి.. అయితే సుధకి చెయ్యదగ్గది ఇదొక్కటే...' జానకి గొంతుక వణికింది.

'మీ కోసం వచ్చినా సరే ని మీరంతా సుధమీద ఎంతో సానుభూతి పరితాపం చూపుతున్నాం అనుకుంటూ, అన్ని విధాలా దాన్ని నిరుత్సాహపరుస్తూ దాని మనసు పాడు చేస్తున్నారు. దానికున్న ఆ లోపాన్ని ఏవిధంగానన్నా తీర్చగలుగుతామేమో ని ప్రయత్నించడం పోయి ఇదా మనం చెయ్యాల్సిన సహాయం.'

'ఏం చెయ్యమన్నావ్ బాబూ' ఇదంటే మా చేతుల్లో పనిగానీ—

'ఉండత్తయ్యా. నేనొక్క మాటడుగుతాను. మాకందరికీకూడా సుధ విషయమై కొంత బాధ్యతా, అభిమానం, వుందన్న నమ్మకం నీకుందా' సూటిగా అడిగాడు రఘు.

'ఎంతమాట బాబూ, నాకా విశ్వాసం పరిపూర్తిగా వుంది'

'అయితే దానిపూచీ మామీదవుంచి కొన్నాళ్ళవరకూ, అంటే, నే చెప్పేవరకూ నువ్వేటువంటి ప్రయత్నాలేవీ చెయ్యొద్దు తెలిసిందా'

'సరి నీ ఇష్టప్రకారం అలాగే బాబూ'

'అత్తయ్యా, కొన్ని సంవత్సరాల క్రితం అంటే నేను మెడికల్ కాలేజీలో చేరిన కొత్తల్లో. సుధ పుట్టినప్పటి వివరాలు కొన్ని నిన్నడిగి రాసుకున్నాను గుర్తుందా నీకూ.'

ఉందన్నట్టు తలాడించింది జానకి.

నాకు బాగా పరిచయం వున్న ఒక పెద్ద డాక్టరు అన్న ఒకాయన అదే టైములో ఆ ప్రాంతాల్లో డాక్టరుగా పని చేసినట్టు తెలిసొస్తోంది. ఆ వివరాల్ని గురించి తెలుసుకుందుకే ఈ డాక్టరుతోకూడా నేను రెండు మూడుసార్లు రాయవలసి వెళ్ళడం జరుగుతుంది. ఆ వివరాలే గనక సరిగ్గా తెల్సుకోగలిగితే; అంటే సుధకీ పరిస్థితి పుట్టుకలోనే వుందో, తరవాత ఏర్పడిందో, ఆ వివరాల్నిబట్టి, సుధ కాలు బాగు చెయ్యడంలోని నమ్మకం, సుళువూ రెండూ విశదమైపోతాయన్నమాట.'

'ఏదో బాబూ ఆ భగవంతుడే నీ ప్రయత్నానికి జయం కూర్చాలి' అంది నెమ్మదిగా జానకి.

'దైవసహాయం మాటలా వుంచి, కాని, ఈ విషయాలన్నీ నేను తెల్సుకుని ఏదో నిర్ణయానికొచ్చేవరకూ ప్రస్తుతం మీరు ఇటువంటి గొడవలు చెయ్యకుండా వున్నారంటే నాకెంతో సహాయపడ్డవారవుతారు తెలిసిందా.'

'అలాగే బాబూ' నా తెలివి తక్కువతనంతో నీకిబ్బంది కల్గించానో, ఏమిటో.' అంది నొచ్చుకుంటూ జానకి.

నిజానికి జానకికూడా కొన్ని సదుపాయాల్నుద్దేశించే ఈ ప్రయత్నం ప్రారంభించిందని చెప్పాలి. ఎందుకంటే ఎంతెంత దూరాన్నుంచో, ఎందరెందరో పెద్ద మనుషులు రఘుకి తమ కూతుళ్ళ నివ్వాలన్న అభిలాషతో తరుచూ వస్తూండడం, పాపం అలా వచ్చినవారిలో అటు వద్దని చెప్పలేక ఇటు మాటా ఇవ్వలేక పార్వతమ్మా, శర్మగార్లు ఇబ్బంది పడుతూన్నందువల్ల అందులోనూ రాజమ్మ దత్తుగార్లు చేస్తున్న వత్తిడి మరీ ఇబ్బంది కలిగిస్తూన్నందువల్లా, తను ముందే సుధకి పెళ్ళి చేసేస్తే అటు రఘుకి, సందిగ్ధం తప్పుతుంది. ఇటు పెద్దవాళ్ళా నిరాసాటంగా సబంధాల్ని గురించి ప్రయత్నాలూ చేసుకుందుకూ వీలుగా వుంటుందన్న భావంతో ఇలా తలపెట్టింది. అయితే ఇప్పుడు రఘు తను స్వయంగానే ఇంత సుతిరంగా చెప్పడంతో ఆ ప్రయత్నాలన్నిటితో విరమించేసుకుంది జానకి.

(ఇంకా ఉంది)



# కళా, కళ్యాణమండపాలు

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంలో జరిగిన నాటకోత్సవాలలో ప్రసంగిస్తూ, ముఖ్య మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి నాటక, నృత్య ప్రదర్శనలపై వినోదపుపన్ను ప్రభుత్వం రద్దు చేస్తుందని చెప్పారు. ప్రజలను వినోద పరచటానికి కొత్తటాలెంటు అభివృద్ధికి, లలిత కళల అభివృద్ధికి ఇలాంటి నిర్ణయం ఎంతో అవసరం.

అయితే దానికి అవసరమయిన కళామండపాలు నిర్మించటానికి ఆంధ్రదేశంలో ప్రభుత్వరంగంలో తప్ప వేరే అవకాశాలు ఏమి ఉన్నాయి అని పరిశీలించాలి.

ముఖ్యంగా బెంగుళూరు, మద్రాసులాంటి నగరాలలో ప్రజలు సమావేశ మవటానికి ఏలయ్యే అవకాశాలు, అంటే అలాంటి సాంఘికజీవితంలో అవసరమయ్యే సమావేశ స్థలాలు, ప్రోత్సహించే పద్ధతులు ఏమైనా అవలంబించారా అని పరిశీలించాలి. ఎందువల్ల నంటే ఆ పట్టణాలలో ఎన్నో కళ్యాణ మండపాలు వచ్చాయి. ఎంతోమంది సంస్థలు, వ్యక్తులు కళ్యాణమండపాలు నిర్మించారు. అవిపేరు ప్రతిష్ఠలు తేవటమే కాక ఏ ఉపయోగంలో లేని పెద్ద భవంతుల ప్రక్క ఒకహాలు $30 \times 60$ లేక $40 \times 80$ సైజులో హాలు నిర్మించి దానిని వివాహాల సీజనులో కళ్యాణ మండపంగాను, ఇతర రోజులలో కళామండపాలసుగా వాడుకొంటున్నారు. మున్సిపాలిటీలు అలాంటి ప్రజోపయోగకరమైన సమావేశ స్థలాలను తాము నిర్మించ నక్కరలేకుండా పన్నులు తగ్గించి ప్రోత్సహించుచున్నాయి.

అదేవిధంగా ఆంధ్రప్రభుత్వం యీ విషయాన్ని, పరిశీలించి, అన్ని మున్సిపాలిటీలకు ఆదేశాలు జరిపి యీ కళ్యాణ మండపాల నిర్మాణానికి దోహదం చేయాలి. సత్రాల మాదిరిగానే ఇంటిపన్ను లేకుండా చేయకపోయినా చాలా కొద్దిగా విధించాలి.

ఆంధ్రప్రదేశ్‌లో కళ్యాణ మండపాలు లేవు. కళా



మార్పు చేయబడిన ప్లాను

మండపాలు లేవు. ఇతర రాష్ట్రములతో పోల్చు కుంటే మనం చాలా వెనుకబడి వున్నాము.

ఆంధ్రప్రదేశ్‌లో జమీందారులకు గానీ, లేక వెనుక పెద్ద కుటుంబాలకి చెందిన వారికిగాని భారీ ఎత్తున నిర్మింపబడిన పురాతన భవనాలు చాలా వున్నాయి. అవి ఏవిధంగానూ ఉపయోగించ లేకున్నాయి. పై సత్రాలు గత కాలంలో ప్రసిద్ధికెక్కి, ఆ తర్వాత క్షీణించి పోయిన సంస్థలకు చెందిన భవనాలు చాలా నిరుపయోగంగా ఉన్నాయి. ఈ భవనాలను కళామండపాలుగా, కళ్యాణ మండపాలుగా తప్ప చేస్తే వాటి ఆదాయం ఉండటమే గాక కళ్యాణమండపాల విషయంలో ఇతర రాష్ట్రాలలో పోల్చితే మనం వెనుకబడినతనాన్ని పోగొట్టుకోవచ్చును. ఈలాంటి భవనాలను ఈ విధంగా తర్చి దిద్దేందుకు వ్యక్తులుగాని, సంస్థలు గాని ముందుకు వస్తే ప్రభుత్వం ఆర్థికంగా ఇతరత్రా సహాయము చెయవచ్చును... అంతేగాక సాముదాయక ఉపయోగానికి మండపాలు నిర్మించడం లేదనే విమర్శనను రాష్ట్ర ప్రభుత్వమే గాక స్థానిక సంస్థలు కూడా తప్పించుకోవచ్చును. అంతే కాదు, ఆంధ్రదేశంలోని వివిధ ట్యుటోరియల్ కాలేజీలు కూడా ఇలా చెయటానికి ముందుకు రావచ్చును.

స్థానిక సంస్థలు పన్నులు విషయంలో రాయితీలు యిస్తే యీ మండపాల నిర్మాణ కార్యం సులభతర మవుతుంది. స్థానిక సంస్థలు కాదన్న ఆర్థిక దుస్థితితో చేయలేని పనులను సహితము ఇతర ప్రజా సంస్థలు చేయటం జరుగుతుంది. యువతరం వ్యక్తులు కూడా ముందుకు రావచ్చును.

కళ్యాణమండపాలు అవసరాలు కూడా ప్లానులో పొందుపరచాలి, దాని వలన కళామండపానికీ ఆర్థిక సౌష్ఠవం ఏర్పడుతుంది. కళామండపాల అవసరం, కళ్యాణమండపం అవసరాలు ఒక్కొక్క దగ్గర ఒకేలా వుంటాయి.

| కళామండపం | కళ్యాణ మంటపం |
|---|---|
| స్టేజి, | వేదిక, |
| సీటింగు. | సిటింగు. |
| ఫ్యాను. | ఫానులు. |
| లైటింగు. | లైటింగు. |
| క్యాంటీను. | డైనింగుహాలు. |
| గ్రీన్‌రూము. | డ్రస్సింగురూము |
| కళాకారులకాష్టింగు | విడిదులు. |



పెద్ద భవనం ప్లాను



పైనుంచి కనబడేది

ఆంధ్రదేశములో పెండ్లిలగ్నాలు పరిశీలించితే సుమారు 24 ఉంటాయి. పెళ్ళిళ్ళ హంగులకు ఎంతో ఖర్చు చేసేవారు చాలామంది వున్నారు. కానీ అనవసరపు శ్రమ. తమిళనాడులో సుమారు 40 లగ్నాలు ఉంటాయి. అంటే కళ్యాణ మండపం ఉభయప్రయోజనంగా ఉండాలి, మనకు మిగతా రోజులు కళామండపంగా ఉపయోగపడు తుంది. లలితకళల అభివృద్ధికి, సంగీత కచేరీలకు, నృత్య ప్రోగ్రాములకు, నాటకాలకు కళామండపాలు ఉపయోగ పడతాయి.

గ్రామీణ ప్రాంతాలలో పంచాయితీరాజుకార్య క్రమాల క్రింద నిర్మింప బడిన కమ్యూనిటీ హాళ్లు కూడా కళా, కళ్యాణ మండపాలుగా మార్చ వచ్చును.

**ఆర్థిక సహాయం :**

ఈ మండపాల నిర్మాణానికి బ్యాంకులు అప్పులు, యివ్వడం అవసరం. బ్యాంకులు యిచ్చే సాధారణ అప్పుల పథకము అంటా రాష్ట్ర ప్రభుత్వము యీ విషయంలో ప్రతీకంగా ఒక పథకం రూపొందించి. అప్పులు యిచ్చేటట్లు చేయాలి.

కళ్యాణమండపాలు కళా మండపాలుగా కూడ నిర్మింప బడాలి. సంవత్సరములో కొన్ని రోజులు మాత్రమే వివాహాలు ఉంటాయి. కాబట్టి మిగతా రోజులలో కళ్యాణ మండపాలు ఖాళీగా ఉండటము వలన వీటిపై పెట్టిన పెట్టుబడికి వడ్డీకూడ గిట్టుబాటు కాదు కనుక కళ్యాణ మండపాలను కళా మండపాలుగా నిర్మించినట్లయితే వివాహాలు శుభ కార్యములు లేని సమయములో నాటకాలు నృత్య సంగీత కార్యక్రమాలకు వాటిని వాడుకో వచ్చును.. కేవలం సినిమాలుతప్ప వేరే వినోద కార్యక్రమములు నాటక, నృత్య, సంగీత కలాపాలు దాదాపు అంతరించి పోయిన ఈ రోజులలో అలాంటి కళ్యాణ మండపాల వలన అంతరించబోతున్న ఈ కలాపాలకు నూతనోత్సాహాలు ఇచ్చినట్లు అవుతుంది. వృత్తి నాటకాలు విస్తృతంగా ప్రదర్శించబడే ఆరోజుల్లో ఆ ప్రదర్శకులకు యిచ్చే సౌకర్యము లేకనే అవి క్రమేణా అంతరించి పోయాయి. లేదా ఈ నాటక సమాజాల వారే నాటకాలు ప్రదర్శించేందుకు తాత్కాలికంగా డేరాల్లాంటివో లేక రేకుల షెడ్లు కట్టుకుంటున్నా చాలా వ్యయ ప్రయాసలతో కూడుకొని ఉంది. పైగా ప్రేక్షకుల రద్దీ ఎక్కువైతే వారికి రక్షణ లేకుండా పోయినది.

మరీ గ్రామీణ ప్రాంతాలలో వినోద అవకాశాలు తక్కువగా ఉంటున్నాయి. నాటకాలు సంగీత నృత్యాలకు పాఠశాలు తప్ప హాలులు లభ్యం కావడం లేదు. కనుక యిటువంటి కాలంలో చాలా ప్రాంతాలలో పంచాయితీ రాజ కార్యక్రమాల క్రింద నిర్మింపబడిన కమ్యూనిటీ హాళ్లను కళామంటపాలుగాను, కళ్యాణ మంటపాలుగాను తీర్చి దిద్దితే పంచాయితీరాజ కార్యక్రమాలలో సాముహాయిక ఉపయోగానికేగాక, వృత్తి నాటక ప్రయోజనాలుగాని లేక ఔత్సాహ కళాకారులు గాని గ్రామీణ ప్రాంతాలలో కళారూపాలను ప్రదర్శింపగలరు. యివి ప్రదర్శించేందుకు అవకాశాలు ఏర్పడి నప్పుడు చెల్లా చెదురుగా ఉన్న ఈ కళాకారుల సంఘాలకు [illegible] అవకాశాలు మెరుగవుతాయి. ఈ హాళ్ళలో గ్రామీణ ప్రాంతాలలో సభలు సమావేశాలు జరుపుకునేందుకు ఉపయోగ పడతాయి. కళ్యాణమంటపాలలో ముఖ్యంగా పరిశుభ్రత, సీటింగు విషయములు మొదలయినవి చాల ముఖ్యం. ఈ కళా [కళ్యాణ] మండపాలు వివిధ దశలలో నిర్మించవచ్చు.

| | | |
|---|---|---|
| హాలు | 40 × 80 | 30,000 రు |
| కుర్చీలు | 500 — | 15000 |
| బల్లలు | | 5000 |
| లైటింగు, ఫ్యానులు | | 10,000 |
| పరిశుభ్రతకు | | 20,000 |
| | | 80000 |

యివన్నీ క్రమేణా ఏర్పాటు చేసుకోవచ్చును. అందువలన ఖాళీగా ఉన్న భవంతులు కలిగినవారు వెంటనే ప్రయత్నించ వచ్చును. పట్టణ జనసంఖ్యకు వాని నిర్మాణానికి ఏదైనా సంబంధం ఉన్నదా అని చూడవచ్చు. ఈనాటి పరిస్థితులను బట్టి 1 లక్ష మంది ఉన్న పట్టణంలో 5వరకు అవసరం ఉంటుంది. మీ పరిశీలనకు ఒక పాతహోస్టలు భవనాన్ని ఏవిధంగా కళామండపాల [కళ్యాణ] మంటపంగా మార్చటానికి వీలవుతుందో ఈ పేజీలో ప్రచురించిన చిత్రాలలో వివరించ బడింది.

—కొత్రుగడ్డ నరసయ్య ●

వెన్నెల చాలా తీవ్రంగా కురుస్తోంది.

దానికి వెన్నెలని గుర్తించే స్థితిలో లేడు సుబ్బారావు.

రాత్రి ఎనిమిదిగంటలు దాటింది. దారి ప్రక్కంటే వెన్నెల ఆరబోసినట్టి శ్వేతాన్ని దానం చేస్తోంది.

బస్‌స్టాండులో — తన ఆలోచనలతో తను పోట్లాడుకుంటూ నిలబడ్డాడు సుబ్బారావు. దాదాపు గంటనుంచి అక్కడే అలా నిలబడి వున్నాడు.

సన్నని మనిషి కావడంచేత సుబ్బారావు పొడవుగా కనిపిస్తున్నాడు. నలుపూ తెలుపూ కాని ఒంటి రంగు, నలిగిపోయి మాసిపోయిన ఇజారూ, చొక్కా, చెదిరి నుదురు మీదికి జారుతున్న నువ్వుటి వెంట్రుకలు, మనిషి నిస్సత్తువగా వున్నాడు. నెత్తిమీద పడుతున్న కోరికల్ని తీర్చుకోలేనివాడు తొలగించడానికి ప్రయత్నిస్తున్నట్లుగా — బొటనవ్రేలితో మాటిమాటికీ నుదుటి మీద జుత్తును పైకి తోసుకుంటున్నాడు. కళ్లు — నిరసంగా, బరువు జీవితానికి ప్రతిరూపంలా వున్నాయి. ఎండగా లేదు గనక, చెప్పులు లేని అతని పాదాలు కన్నీళ్లు కార్చడంలేదు.

'బాబూ...'

ఒక మునలి ముష్టివాడు సుబ్బారావు ఎదురుగా నిలబడ్డాడు. చేతిలో కర్రతో పడిపోకుండా ఊతచేసుకుంటున్నాడు. మరో చేతిలో ఉన్న డబ్బుల్ని గలగల్లాడిస్తూ ముందుకి చాపాడు.

ఒక్కక్షణం సుబ్బారావు వాడి వైపు చూశాడు. జేబులో చెయ్యి పెట్టాడు. టిఫిన్ పైసలు నాలణాకాక జేబులో మిగిలిన రెండుపైసలు బయటకు తీసి ముష్టివాడి చేతిలో పడేశాడు. దండం పెట్టి, సుబ్బారావుని తన భాషలో దీవించుకుంటూ ముష్టివాడు టకటకా కర్ర చప్పుడుతో సాగిపోయాడు.

ఆలోచిస్తూ మిగిలిపోయాడు సుబ్బారావు. ఇంటికి వెళ్ళాలి. ఎలా చేరుకోవాలో అతనికి తెలియడం లేదు. ఇప్పుడు — ఏడు మైళ్ల ఇవతల ఈ బస్ స్టాండులో వున్నాడు. ఈ రాత్రి — ఏ బంధువులూ లేని ఈ పట్టణంలో నిలబడ్డాడు. ఏడు మైళ్లు! ఎలా వెళ్లాలి?

గొప్ప చేనేత చీరలకి పుట్టిల్లే అయినా సుబ్బారావు చేరవలసిన ఊరు చాలా చిన్నది. పగలగొడుతున్న [illegible] విస్తరించి విరిసిపోయిన చిన్న ముక్కలాగ [illegible] విశాలమైన సముద్రపు ఒడ్డున వుంది ఆ వూరు. అక్కడికి వెళ్ళాలన్నా, రావాలన్నా అన్నీ అసౌకర్యాలే. రెండు మూడు గంటలకి ఒకసారి గాని పట్టణంనుంచి బస్ వుండదు. రాత్రి ఎనిమిది గంటలతో బస్‌లన్నీ ఆఖరు. ఒక్కొక్కరోజు ఒకటో ఆరో రిక్షాలుంటాయి. కాని అవి పది గంటలకే వెళ్ళిపోతాయి.

సుబ్బారావుకి ఇలాంటి సమయాల్లోనే తన గుమాస్తాగిరిమీదా, జీవితం మీదా అసహ్యం కలుగుతూ వుంటుంది.

నెల్లాళ్లూ చాకిరీ చేస్తే ధాన్యం మిల్లువాళ్లు సుబ్బారావుకి తొంభై రూపాయలిస్తారు. అతనికీ, కమలకీ, ముగ్గురు పిల్లలకీ ఆ తొంభై రూపాయిలూ తిండి పెడుతున్నాయి.

ఈ రోజు మధ్యాహ్నం మిల్లు పని మీద పట్టణానికి వచ్చాడు సుబ్బారావు. ఎవరో ఒక పెద్ద రైతు దగ్గర పెద్ద మొత్తంలో ధాన్యం నిలవ వున్నాయని లోపాయికారీగా తెలిసింది. వాకబు చేసుకు రమ్మని యజమాని పంపాడు, బస్ ఛార్జీలుమాత్రం యిచ్చి. సుబ్బారావు వచ్చేసరికే నాలుగు గంటలయింది. అడ్రసు ప్రకారం వెతుక్కుంటూ ఆ మోతుబరి రైతుని గంట తర్వాత కలుసుకున్నాడు. ఆ రైతు ధాన్యం అన్నీ రెండు మైళ్ల అవతల పొలంలోనే జాగ్రత్తగా భద్రపరిచాడు. పైన చిన్న పశువుల కొట్టం— దిగువన వెయ్యి బస్తాలు నిలువ చేసే భూగృహం! ఆ గదినిండా ఉన్న సరుకుని చూశాక, దేశానికి తిండికొరత ఎందుకొచ్చిందో బోధపడింది సుబ్బారావుకి. సరుకు నాణ్యత చూసుకుని బేరసారాలు మాట్లాడుకునేసరికి పొద్దు నలుపులోకి వివ పోతోంది. తొందరగా తిరుగు ప్రయాణమయ్యాడు. ఆ గతుకుల రోడ్డుమీద తడుముకుంటూ నడుస్తున్నప్పుడు సుబ్బారావుకి ఒక సందేహం వచ్చింది— ఆయన గారు ఇంత రహస్యంగా దాచిన స్థలం నాలాటివాడికి ఎందుకు చూపించినట్లు?' అని. ఈ సందేహం తీరలేదు. 'బహుశా ఈ ప్రభుత్వం అంటే నాకు భయం లేదు. సున్నా చేసేసరికి మాత్రంతో నాకేం పోదు — అనే ధీమా ఆయన కుందేమో?' అని సరిపెట్టుకున్నాడు. దేశాన్ని కడిగిన ముత్యాలరాసిలా తయారు చెయ్యాలనే కోరిక తనలాటి వాడికి పెద్దదని తనని తానే జోకొట్టుకున్నాడు. బస్ దాటి పోతుందన్న భయం వెన్ను తట్టేసరికి ఆలోచనల్ని దూరంగా తోసేసి త్వర త్వరగా నడవడానికి ప్రయత్నించాడు.

చివరికి బస్ స్టాండ్ చేరుకున్నాడు సుబ్బారావు. అప్పుడే ఎనిమిది గంటల బస్ వెళ్లిపోయిందట! అతని ప్రాణం ఉసూరుమంది. రెండు మైళ్ల గతుకుల్లో, చీకటిలో కాళ్లు విరుచుకుని నడిచి వొచ్చాడు. బస్ దాటిపోయింది. బరువుగా నిట్టూర్చాడు. తనకి దాపురించిన ఈ మిల్లు పనిమీద విసుక్కున్నాడు. ఇంక రిక్షా తప్ప గత్యంతరం లేదు. స్టాండులో ఒకటే రిక్షా వుంది. తను రిక్షా ఎక్కలేడని అతనికి ముందే తెలుసు. అయినా రిక్షావాణ్ణి అడిగాడు.

'ఏటి బాబియ్యాల కొత్తగడుగుతారు! మూడ్రూపాయలేగా! ఎక్కండి బాబూ— రాకెట్టులాగ లక్కుపోతాను' అన్నాడు రిక్షావాడు.

సుబ్బారావు జేబులో చెయ్యి పెట్టాడు. రిక్షావాడి ముఖంలోకి ఒకసారి చూసి కిళ్లీ బడ్డీవైపు నడిచాడు.

'ఏంబాబూ రారేటి?' రిక్షావాడికేక సుబ్బారావు వీపుకి వినిపించింది. మౌనంగా తల ఆడించి ముందుకి నడిచాడు. అతను చిన్నా కిళ్లీ బడ్డీదగ్గర మూడు నిముషాలు నిలబడ్డాడు. చుట్టూ చూస్తున్నాడు. రిక్షావాడికి బేరం వొచ్చింది. ఎవరో ముగ్గురు — జేబులు నిండుగా వున్నవాళ్లు ఆ రిక్షాలో వెళ్లిపోయారు. సుబ్బారావు చూస్తూ ఉండిపోయాడు. తన నిస్సహాయతని, దుర్దశ్నీ చూస్తూ మిగిలిపోయాడు.

'ఏం కావాలండీ?' కి[illegible]గింది.

ఒక నిట్టూర్పుతో ఆలోచన దూరంగా నెట్టేస్తూ సుబ్బారా[illegible] సిగరెట్టు కొన్నాడు. అక్కడే వున్న త[illegible] ఒకటి వెలిగించుకున్నాడు. [illegible] భద్రంగా జేబులో దాచుకున్నాడు.

# నడక నేర్పినవాడు

వెళ్ళిపోయింది, రిక్షా వెళ్ళిపోయింది — ఇప్పుడేం చెయ్యాలి ? సిగరెట్ పీలుస్తూ సుబ్బారావు నిలబడే ఉన్నాడు.

* * *

దారిలేని సుబ్బారావు దారికోసం వెతుక్కుంటూ నిలబడ్డాడు. అతనికోసం కాలం ఆగడం లేదు. పదిగంటలైంది. ఆందోళనతో తనకోసం ఎదురుచూస్తూ ఇంట్లోకి వీధి గుమ్మంలోకీ తిరుగుతున్న కమల అతని మనస్సులో కదిలింది. 'ఏమీ కంగారు పడకు. వొచ్చేస్తున్నాను కమలా. నువ్వు భోజనం చేసెయ్యి. నాకోసం చూడకు. పిల్లలు నిద్రపోయారా? నాకోసం పేచీ పెడుతున్నారా!...ఎలాగ చెప్పను నా జేబులో ఎంత డబ్బుంటుందో నీకు తెలియదూ? షావుకారు రూపాయే ఇచ్చాడు. బస్సులు మనకోసం ఆగుతాయా నీ వెర్రి గాని. ఒక్క పదినిముషాలు ముందుగా వొస్తే ఈపాటికి నీదగ్గరే ఉండేవాణ్ణి...' సుబ్బారావు లోలోపల కమలతో మాట్లాడుతున్నాడు. ప్రశ్నలు అడుగుతున్నాడు— జవాబులు ఊహించుకుంటున్నాడు. రవ్వంత తృప్తి, కొండంత అశాంతి పొందుతున్నాడు.

కిళ్ళీబడ్డీ మూసేసి కొట్టువాడు ఎప్పుడు వెళ్ళిపోయాడో సుబ్బారావుకి తెలియలేదు. కాలం నడిచిపోతూంది — ఎంతవరకూ నడిచిందో తెలియడం లేదు.

మొదటి ఆట సినిమా వొదిలేసినట్టున్నారు: అప్పటివరకూ ఉన్న నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ సైకిలుగంటలు, రిక్షా మువ్వలు, అర్థాలు తెలియని మాటలతో మనుష్యులు — కోలాహలంగా వుంది. సైకిలు మీద సినిమాకి వచ్చిన, తన ఊరిమనిషి యెవరైనా కనిపిస్తాడేమోనని ఆశగా, ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు సుబ్బారావు. ఎన్నో సైకిళ్ళు అటూ యిటూ వెళ్ళిపోతున్నాయి. తన ఊరివెంపుమాత్రం ఏ ఒక్కటీ తిరగలేదు.

నెమ్మదినెమ్మదిగా జనం పల్చబడిపోయారు; కోలాహలం ఆగిపోయింది. రోడ్డు యించుమించు మళ్ళీ నిర్మానుష్యమైపోయింది.

వెన్నెల తియ్యగా కురుస్తున్నట్టు సుబ్బారావుకి తెలియడం లేదు. వేడిగా నిట్టూర్చాడు. జేబులోంచి రెండో సిగరెట్ తీసి, ఉన్న ఒక్క అగ్గిపుల్లతోనూ వెలిగించుకున్నాడు. తన జీవితంమీద మరోసారి అసహ్యం కలిగింది. చంద్రమండలానికి సైతం వెళ్ళిపోగలుగుతున్న ఈ రోజుల్లో నాకో సైకిలు — కనీసం ముసలి సైకిలైనా లేకపోవడం ప్రపంచ పురోభివృద్ధికి సవాలేనా...! ఐనా నా దురదృష్టానికి ప్రపంచం ఏం చేస్తుంది...? నా లాంటివాళ్ళు, నాకంటె తక్కువవాళ్ళు ఎన్ని కోట్లమంది వున్నారో...!' సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తూ నిలబడే ఉండిపోయాడు సుబ్బారావు. ఏంచెయ్యాలి? ఈ రాత్రి ఎక్కడ పడుక్కోవాలి? ఆత్మారాముణ్ణి ఎలా నిద్రపుచ్చాలి? — అన్నీ ప్రశ్నలే నేటికి సమాధానాలు లేవు. ఊహూ — ఎలాగైనా ఈ రాత్రి ఇంటికి చేరిపోవాలి. మనసు తొందరచేస్తూంది. పరిస్థితులు ఉచ్చులు బిగిస్తున్నాయి. వెర్రివాడిలా చూస్తూ, [illegible]న్నాడు.

దూరంగా ఎక్కడో కారు చప్పుడు వినిపిస్తోంది.

'ఆ కారు నా కోసం అయి, నన్ను ఎక్కించుకుని మా ఇంటిముందు దింపితే ఎంత... ఊహూం...ఆ కారు నాదే. పెట్రోలు కోసం డ్రైవరు తీసుకెళ్ళాడు. వచ్చేస్తున్నాడు. ఇప్పుడే ఆ కారు రావొచ్చు.'

కారు దగ్గరైంది. [illegible] కారు. [illegible] [illegible] నిలబడింది. [illegible] [illegible]గా చూస్తున్నాడు. ఏవో మాటలు వినిపిస్తున్నాయి.

కారు నిలబడి మాట నిజమే —. కాని విశ్రమంగా మాత్రం కాదు. సుబ్బారావుని కారు గమనించనే లేదు. ఒక జంట కారులోంచి దిగింది. కారులో వున్న మరో జంటతో ఏదో మాట్లాడుతూంది. కారులోకి పరిశీలనగా చూశాడు. ఎవరు ...? స్టీరింగ్ ముందు విశ్వపతే ...? అవును విశ్వపతి...! ప్రక్కన అతనిభార్య. సుబ్బారావుకి ఆనందం కలిగింది. ఆశ అంకురించింది.

విశ్వపతి తన ఊరివాడే. డబ్బులోంచి పుట్టాడు. డబ్బులోనే పెరిగాడు. డబ్బుకి

టానిక్కురిచ్చి పెంచుతున్నాడు. వాళ్ళది ఇల్లు కాదు—పెద్ద భవనం. అతని స్థిర నివాసం పట్నగానుంచి పే కాని కాకినాడలో నాలుగు మేడలున్నాయి; ఏలూరు కంపెనీల్లో పెద్ద వాటాలున్నాయి, రెండు కార్లున్నాయి, దాచలేనంత వర్తకవ్యాపారం వుంది, అందం వుంది, ఆరోగ్యం వుంది, అందమైన భార్యవుంది. విశ్వపతికి లేని దేమిటో సుబ్బారావుకి ఎప్పుడూ అర్థం కాదు.

కారు దిగినజంట కారుకి నమస్కరించి నెమ్మదిగా వెనక్కి సాగిపోయింది. కారు స్టార్టయింది. సమయంకోసం ఆగివున్న సుబ్బారావు చటుక్కున చెయ్యి పైకెత్తి నాలుగంగల్లో కారుముందు నిలబడ్డాడు. కారు కదలడంలేదు గాని బుల్‌డాగ్‌లాగ ఇంజను గుర్రుమంటూంది. విశ్వపతి బయటకు చూశాడు. వెన్నెట్లో నిలబడిన సుబ్బారావు వినయంగా నమస్కరిస్తూ కనిపించాడు. ప్రతి నమస్కారంగా తల ఆడించాడు విశ్వపతి. కారులోవున్న గుడ్డి వెలుగులో విశ్వపతి ముఖం నల్లగా ముడుచుకోవడం సుబ్బారావుకి కనిపించింది.

'విశ్వపతీ...వి...విశ్వపతిగారూ నమస్కారం. నె...నేనూ ... సుబ్బారావుని... మరిచిపోయారా?' తడబడుతూ అడిగాడు

'ఊఁ? ఏమిటికథ ? త్వరగా చెప్పు' విసుగుని దాచుకోవాలనే ప్రయత్నం కంఠంలో కనిపించింది.

సుబ్బారావు ఒక్కక్షణం సందేహించాడు నీళ్లలో పడ్డాక గజగజలాడితే లాభం లేదనుకున్నాడు.

'ఈవేళ మిల్లు పనిమీద ఈ ఊరు వచ్చాను. పని పూర్తయ్యేసరికి పొద్దుపోయింది. ఆఖరి బస్ దాటిపోయింది. దారిలేక ఇక్కడే...' సుబ్బారావు వాక్యం పూర్తి చెయ్యలేదు. పార్థనుకున్నా అతని గొంతులోంచి దూరాన ఒంటరి నక్షత్రం లాగ దైన్యం వినిపించింది.

విశ్వపతి గట్టిగా నవ్వాడు. ఆ నవ్వుకి అర్థం ఏమిటో తెలుసుకునే లోపునే అన్నాడు— 'అదేమిటోయ్ పిచ్చివాడా! దారి లేకపోవడమేమిటి! విశాలంగా —వల్లగా—నున్నగా ఎంత పెడదారి తార్రోడ్డు వుందో చూడు!' మళ్లీ నవ్వాడు.

సుబ్బారావు ముఖం పాలిపోవడం కారులో ఉన్న అతని భార్య గమనించింది.

'ఏం—రిక్షాలేవా?' నవ్వుతుంటూ విశ్వపతి: అడిగాడు విశ్వపతి. నిర్లిప్తంగా చూస్తున్న సుబ్బారావు తల ఆడించాడు.

'ఏమీ అనుకోకు సుబ్బారావు—కారులో నేను ఒంటరిగా లేను.' అన్నాడు

సుబ్బారావు అలాగే చూస్తున్నాడు. కాని ఏదీ కనిపించడంలేదు.

'ఏమండీ.' మెల్లిగా అతని భార్య పిలిచింది.

# నడక నేర్చినవాడు

"ఏం పద్మా?"

'పాపం...కారు ఖాళీగానే వుంది కదా.'

'నీకు తెలియదు పద్మా. నేను ఒక మాటన్నానంటే దానికి తిరుగు లేదు అంతే.'

కారు నెమ్మదిగా ముందుకు కదిలింది. 'సారీ సుబ్బారావ్ – నెక్స్ట్ టైం బెటర్ లక్.' విశ్వపతి గొంతు వెళ్ళిపోతున్న కారులోంచి వినిపించింది సుబ్బారావుకి.

'సుబ్బారావు చాలాసేపటికిగాని తేరుకోలేదు. అతని ముఖంమీద, కారువేసిన రోడ్డు బూడిద ఫకాల్న నవ్వింది. కోపము, దుఃఖము అతని గుండెల్లో ఉప్పులు వాయిస్తున్నాయి. విశ్వపతిని నమిలి మింగెయ్యాలన్నంత కసి; భోరున ఏడవాలనిపించేంత గుండెబరువు అప్పటికే విశ్వపతి చాలా దూరం వెళ్ళిపోయాడు; గట్టిగా ఏడుద్దామనుకుంటే తను అరణ్యంలో ఉండిపోయాడు. ఏమీ చెయ్యలేని నిస్సహాయతతో చివరికి దీర్ఘంగా, బరువుగా నిట్టూర్చాడు సుబ్బారావు తన చిరుగుల చాప జీవితంమీద మరోసారి అసహ్యం కలిగింది. విరక్తి కలిగింది.

చచ్చిపోదా మనుకున్నప్పుడు మరోసారి ఆలోచించుకుంటున్నాడు గనక సుబ్బారావు యింకా బతుకుతున్నాడు.

'ఒరేయ్ పిచ్చి సుబ్బారావ్—విశ్వపతి నన్ను ఆహ్వానించి కారెక్కించుకుంటాడని ఎందుకనుకున్నావ్? నీకూ వాడికీ ఏమిటి స్నేహం? నువ్వేమైనా మేయరువా? చైర్మన్‌వా? పంచాయతీబోర్డు ప్రెసిడెంటువా? మినిష్టరువా? మిల్లు యజమానివా? నీకూ వాడికీ ఏమిటి అనుబంధం? గతం అంతా మరిచిపోయావా? నిన్ను ఆదరిస్తాడని ఎలా అనుకున్నావ్? వాడు నీకు అందని దానిమ్మపండని మరిచిపోయావు. చాలదా — నీకి అవమానం చాలా? వాడికారేగాని నీకు మరొకటి హొరక లేదు! అంతగా నీకు ఇంటికి వెళ్ళాలంటే కాళ్ళు లేవా? ఎందుకురా అవమానం భరిస్తావ్? నడవలేకపోతే వెళ్ళు. ... అరుగుమీద తెల్లారేదాకా నిద్ర... కనులని, కుర్రాళ్ళనీ తలుచుకుంటూ ...ట్లోనే ఉన్నావనుకుని తృప్తిపడు. ...యిం లేచి ఎనిమిదిగంటల బస్‌లో అఘోరించు, సిద్ధంగా వొండిపెట్టుకున్న మీ షావుకారు చీవాట్లు కడుపు నిండా భోంచెయ్యి.'

సుబ్బారావు తనలో తనే మాట్లాడుకుంటున్నాడు. ఆత్రుతగా ఎదురుచూస్తున్న కమల మళ్ళీ కనిపించింది. ఆమె కళ్ళలో నిలిచిన కన్నీళ్ళు కనిపించాయి. 'ఇంకా భోజనం చేసి ఉండదు. చంటాడు నాదగ్గరేగాని అన్నం తినడు' నిద్రలో కూడా వెక్కివెక్కి పడుతున్న కుర్రాడూ కనిపించాడు.

'వెళ్ళాలి — ఎలాగైనా ఈ రాత్రి ఇంటికి వెళ్ళిపోవాలి' దృఢంగా నిశ్చయించుకున్నాడు సుబ్బారావు. ప్రయాణసాధనాల కోసం అతను ఎదురు తెరవదల్చుకోలేదు. ఈ అడవిలో అతనికి ఉండాలని లేదు. అతని కాళ్ళు అప్రయత్నంగా కదిలాయి.

వెన్నెల తియ్యగా కురుస్తున్నట్టు ఇప్పుడూ తెలియడం లేదు సుబ్బారావుకి. విశ్వపతి తనని కారెక్కించుకుంటె ఈ పాటికి ఇంట్లో ఉండేవాడు. నిట్టూర్చాడు.

'ఇలా నడిస్తే తెల్లవారేసరికైనా యింటికి వెళ్ళలేకపోను' అనుకుంటూ నడుస్తున్నాడు.

ఏం మైళ్ళు! విశ్వపతి చెప్పినట్టు తారురోడ్డు నలగా, సన్నగా, పొడవుగా పరుచుకుని వుంది. అతని కాళ్ళు రోడ్డుని వెనక్కి నెట్టేస్తున్నాయి. మనసు గతాన్ని ముందుకు తెచ్చుకుంటుంది!...

*　　*　　*

ఎలిమెంటరీ స్కూలు మాస్టారు — వెంకటేశ్వర్లుగారికి నలుగురు ఆడపిల్లల తరువాత పుట్టిన కొడుకు సుబ్బారావు. సుబ్బారావు కాస్త ఎదిగేసరికే కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యడం పూర్తయిన మాస్టారి నడుము 'ద'లాగ ఒంగిపోయింది. అయినా సంసారాన్ని ఈడ్చడం అయనకి తప్పలేదు.

ఎలిమెంటరీస్కూల్లో చదువుకునేప్పుడు విశ్వపతి సుబ్బారావుతో సౌమ్యంగా వుండేవాడు, అప్పట్లో అతని ఖరీదైన దుస్తుల్ని, బంగారు ఛాయనీ చూసి అలాంటివి తనకు లేనందుకు సుబ్బారావు ఎక్కువగా దుఃఖించేవాడు. 'ఇవన్నీ ఎలా వొచ్చాయిరా?' అని సుబ్బారావు అడిగితే—'ఏమో, నీకు లేవా?' అనేవాడు విశ్వపతి. అలాంటివన్నీ నాన్నని అడిగి కొనుక్కోలనుకునేవాడు. ఒక్కొక్కసారి వీపుపెట్టు దెబ్బలుకూడా తినేవాడు.

మనిషి ఎదిగేకొద్దీ జీవితాలకు అర్థం చేసుకునే శక్తిని సంపాదించుకున్నాడు సుబ్బారావు. బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం సంపాదించుకుంటే బతుకు దర్జాగా వెళ్ళిపోతుందని కలలు కనేవాడు.

స్కూలంతటికి ఎప్పుడూ సుబ్బారావే మొదటివాడు. అది విశ్వపతికి ఈర్ష్య కలిగిస్తుందని అతనెప్పుడూ అనుకోలేదు. విశ్వపతి నెమ్మది నెమ్మదిగా తుంటరివాడుగా జరిగిపోయాడు. తన మిత్రుల్ని పోగేసి పీరియడప్పుడల్లా సుబ్బారావుని ఏడిపించాలని చూసేవాడు. ఆటల్లో అల్లరిగా ప్రవర్తించడం—తనదే న్యాయమని మొండిగా మిత్రుల బలంతో వాదించడం, ఆనందించడం. ఇలాంటి సంఘటనలు తరుచు జరగడంతో సుబ్బారావు కూడా విశ్వపతికి ఎడంగా జరిగాడు. ప్రత్యర్థిగా విశ్వపతి అతనికి మరి దగ్గరయ్యాడు.

ఒకరోజు ఒంటరిగా స్కూలునుంచి యింటికి వస్తున్నాడు సుబ్బారావు. ... సందులో పదిమంది కుర్రాళ్ళు నిలబడి ఏదో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మధ్య విశ్వపతి ఉన్నాడు. సుబ్బారావు తల వంచుకుని వాళ్ళని దాటి వెళ్ళిపోతున్నాడు. హటాత్తుగా వదిమందీ అతన్ని చుట్టుముట్టారు.

'ఏరా, మొన్న అప్పారావుదగ్గిర నన్ను తిట్టావుట? ఒళ్ళు కొవ్వెక్కిందా?' సుబ్బారావు చొక్కా గట్టిగా పట్టుకొని రెట్టిస్తూ అడిగాడు విశ్వపతి.

'ఎవరు నీకు చెప్పింది?' చొక్కా మర్యాదగా వొదులు.' అంటూ సుబ్బారావు విదిలించుకున్నాడు. అంతే — పదిమందీ అతనిమీద పడ్డారు. ఒంటరి సుబ్బారావు ఒంటినిండా వాళ్ళ దెబ్బలు పడ్డాయి.

ఈ పౌరుషం ఎందుకో సుబ్బారావుకి అర్థం కాలేదు. మర్నాడు హెడ్ మాస్టరు ... చెప్పాడు. తిరిగి అతనినే విరిట్టు 'నువ్వేదో అంటేనే గదా ...వాళ్ళు కొట్టారు'... నిన్ను? ...ఇంకెప్పుడూ ఇలాంటి పిర్యాదులు ... మందలించాడు. డబ్బున్న విశ్వపతి అంటే

'ఆయనకీ భయమే మరి! సుబ్బారావు లోలోపల కుళ్లి కుళ్లి ఏడిచాడు.

రోజులు గడుస్తున్నాయి. క్లాసులో ఎప్పుడూ బండగా ఉండే. విశ్వపతి, సుబ్బారావుతోపాటు మెట్లు ఎక్కుతున్నాడు.

* * *

సుబ్బారావుకి మాలతంటే చాలా ఇష్టం. మాలతి తనగురించి ఏ అభిప్రాయంతో ఉండేదో అతనికి తెలియదు. ఆప్యాయంగా తనే పలుకరించేది. ఒకే వీధి కావడం వల్ల తెలియనివి తనచేత చెప్పించుకొనేది. అక్కడా సుబ్బారావుకి విశ్వపతి ఎదురయ్యాడు. మాలతికి ప్రేమలేఖలు రాసేవాడు. నెమ్మదిగా ఆమెతో స్నేహం చేశాడు. ఆమెను ఎలా ఆకర్షించాడో తెలియదు. మాలతి సుబ్బారావుని మరచిపోతోంది. మాలతి, విశ్వపతుల పేర్లు గోడలెక్కాయి. దానికి కారణం సుబ్బారావనే వదంతి పుట్టింది. మళ్లీ గొడవ జరగలేదు కాని విశ్వపతి చూపులు చాలా సూదిగా మారాయి. 'సుబ్బారావ్ — మాలతిని మరిచిపో. ఆమె నీకు దక్కదు మాలతికి దగ్గరగా వచ్చావో — జాగ్రత్త నీ పని ఆఖరు' చిన్న కత్తి చూపిస్తూ ఒకసారి హెచ్చరించాడు విశ్వపతి. ఆ రోజే సుబ్బారావు మాలతి మనసు తెలుసుకోడానికి ప్రయత్నించాడు. 'నన్ను మాలతి ప్రేమిస్తే — ఈ విశ్వపతినే కాదు ప్రపంచం అంతటినీ ఎదిరిస్తాను' అనుకున్నాడు. 'హాయి అమాయకుడా! నిన్ను నేను ప్రేమిస్తున్నానని ఎలా అనుకున్నావయ్యా?' అంది మాలతి. అంతే — ఆనాటి నుంచి మాలతికి దూరమయ్యాడు.

స్కూలు ఫైనల్ పరీక్షలు దగ్గర పడ్డాయి. సుబ్బారావు జాగ్రత్తగా చదువుతున్నాడు. మనసుకి తగిలిన దెబ్బలన్నీ మరిచిపోడానికి ప్రయత్నిస్తూ భవిష్యత్తుకి పూలబాటకోసం శ్రద్ధగా చదువుకున్నాడు అదే సమయంలో మరోదెబ్బ. తండ్రి వెంకటేశ్వర్లుగారు హఠాత్తుగా చనిపోయారు. ఈ దెబ్బ సుబ్బారావు గుండెను పిండేసింది అతను ఒంటిగా మిగిలిపోయాడు అక్కడెవరికీ అతన్ని ఆదుకునే పాటి స్తోమతు లేకపోయింది. చదువు మూలపడింది. పరీక్ష పోయింది. ఆ సంవత్సరమే విశ్వపతి ప్యాసయ్యాడు. ఎలా ప్యాసయ్యాడో సుబ్బారావుకి చాలారోజుల తర్వాతగాని తెలియలేదు. డబ్బు దండిగా వుంటే మార్కులు కూడా పడతాయట! విశ్వపతి, తరువాత బి. ఎ. కూడా ప్యాసయ్యాడు.

చదువుకు స్వస్తి చెప్పిన సుబ్బారావు విధిగా కడుపుకోసం తడుముకోవలసి వచ్చింది. అప్పుడే ధాన్యం మిల్లులో గుమాస్తాగా చేరాడు.

ఆటల్లోనూ, చదువులోనూ, ప్రేమలోనూ — జీవితం అంతటిలోనూ విశ్వపతి ముందు సుబ్బారావు ఓడిపోయాడు. విశ్వపతి చాలా ఎదిగాడు — మేడలు, షేర్లు, కార్లు, భార్య! ఇంకా ఎదుగుతున్నాడు. సుబ్బారావు తన చుట్టూ వున్న మెట్లన్నీ దాటలేక అందులోనే ఉండిపోయాడు.

* * *

తనకు తెలియకుండానే మెట్లన్నీ నడిచాడు సుబ్బారావు. అతని మనసు ఇప్పుడు కాస్త స్థిమితపడింది. విశ్వపతి మీద కోపంగాని, తన జీవితంమీద అసహ్యంగాని ఇప్పుడతనిలో లేవు. 'విశ్వపతి లాంటి వారితో నేను పరిగెత్తలేను. కాని నా చుట్టూ తృప్తిని పేర్చుకుంటేనే తప్ప ముందుకి నడవలేను' అనుకుంటూ నడుస్తున్నాడు. కమల అతని కళ్లముందు నిలబడింది. గుమ్మం పట్టుకుని వీధిలోకి చూస్తుంది. 'వచ్చేస్తున్నాను కమలా'

నాకు జ్యోస్యం చెప్పడం మీద నమ్మకం లేదు కానీ..... చెప్పించుకోవడం మీద కాదు!



తున్నారు పిలవకండి.'

విశ్వపతి చుట్టూ చూశాడు. అతని కళ్ళకి అంతా చీకటిగానే కనిపిస్తోంది. భార్యచెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. వెంటనే వొదిలిపెట్టేశాడు.

'ఏవోయ్ ... ఇదిగో, మిమ్మల్నే ... ఒక్క నిముషం ఆగండి.' చప్పట్లు కొడుతూ పిలిచాడు విశ్వపతి.

సుబ్బారావు వెనక్కి తిరక్కుండా వెళ్ళిపోదామనుకున్నాడు. రెండడుగులు వేశాడు. విశ్వపతి గొంతుకతోపాటు వెనకవెంపు వేగంగా చెప్పులు చప్పుడౌతున్నాయి.

ఆగి వెనక్కి తిరిగి చూశాడు సుబ్బారావు. విశ్వపతి చకచకా సమీపించాడు. తను పిలిచింది సుబ్బారావునని తెలుసుకుని విశ్వపతి కొన్నిక్షణాలు రాతిబొమ్మగా నిలబడిపోయాడు. అప్పటికి పద్మకూడా అక్కడికి వచ్చేసింది.

'ఎందుకు పిలిచారు ?' నిర్వికారంగా అడిగాడు సుబ్బారావు.

విశ్వపతి తేరుకున్నాడు. 'అహాఁ...అది ...అదికాదు సుబ్బారావ్ —మా కారుటైరు బరస్టయింది. అంచేత మేమక్కడ నిలబడ్డాం.' గొంతు వడబడింది. మాట్లాడటానికి చాలా యాతన పడుతున్నట్టు సుబ్బారావు గ్రహించాడు.

'ఏవిటో—ఏం చెయ్యాలో తోచడం లేదు సుబ్బారావ్. కారుతో 'స్టెఫినీ' వెయ్యడం మరిచిపోయి వొట్టున్నాడు డ్రైవరు వెధవ. ఇప్పుడెలాగ ? టైరు ఉంటేనే గాని కారు కదలదు. ఆ వెధవ ఎన్నిపాట్లు పెట్టాడో చూడు మమ్మల్ని. ఇప్పుడేం చెయ్యడం? అబ్బ! ఎంత చీకటిగా వుందో! కదూ ?' అనేసి దిక్కులు చూస్తూ నిలబడ్డాడు విశ్వపతి.

'క్షమించండి నాకు కార్ల మెకానిజం అస్సలు తెలియదు. నేను మీకేం సహాయ పడగలను ?' ప్రశాంతంగా సుబ్బారావు అడిగాడు.

'అదికాదండీ—రేపు టైరుతో సహా డ్రైవరొస్తేనే గాని కారు ఇంక కదలదు ఇక్కడ, ఇప్పుడు ...' పద్మ అంటూ అంటూ చటుక్కున ఆగిపోయింది. పరాయి పురుషుడితో మాట్లాడేసినందుకు భర్త ఏమనుకుంటాడో అని కాబోలు భయం భయంగా చూసింది.

'జాను—జాను' అన్నాడు విశ్వపతి. అతని కళ్ళలో కోపం లేదు.

'ఇంకేవిటా మార్గంలేదంటారా?' సుబ్బారావు అడిగాడు.

విశ్వపతి మౌనంగా తల ఆడించాడు.

సుబ్బారావు ఒక్క నిముషం ఆలోచించాడు.

'మీరు ఏమీ అనుకోకపోతే ఒక్కటే మార్గంవుంది. అంతకుమించి నేను మీకేమీ సహాయపడలేను. మీది చాలా ఎత్తయిన లోకం—మాది చాలా దిగువన బురదలో వున్న లోకం. మీకు కష్టంగానే ఉండవచ్చు కాని తప్పదు. కావాలంటే నాతోపాటు నడవండి. వినే వోపిక ఉంటే మా లోకాన్ని గురించి కాలక్షేపంగా చెబుతాను. వీలైతే సానుభూతి చూపిద్దురుగాని—తెల్లవారేలోపల యింటికి వెళ్ళిపోవొచ్చు. లేదంటే ఉదయంవరకూ తలుపులు వేసుకొని కార్లోనే పడుకోండి. మీ డ్రైవర్ని ప్రొద్దుటే పంపుతాను.' అన్నాడు సుబ్బారావు.

కాసేపు అంతటా నిశ్శబ్దం.

విశ్వపతి భార్య ముఖంలోకి ఒకసారి చూశాడు. చుట్టూ ఉన్న చీకట్లోకి చూశాడు. కీచురాళ్ళ అరుపులు వినలేక

గుండెలు మూసుకున్నాడు. [illegible]

అన్నాడు. ఆ అడివిలో కర్తవ్యాని దూరంగా, భయానికి దగ్గరగా ఉం కంటె సుబ్బారావుతోపాటు నడవడమే అ నికి బాగుంటుందనిపించింది కాబోలు!

'పద్మా—నువ్వు నడవగలవా?' అడిగాడు.

'ఆ—పదిమైళ్ళయినా నడుస్తాను.'

ఒకరితో ఒకరు మాట్లాడకుండ ముగ్గురూ నడుస్తున్నారు. కారు మా కమ్మలా అక్కడే స్థిరపడిపోయింది.

'హమ్మయ్య—ఇప్పుడు చాలా హాయిగ వుంది' అంది పద్మ.

మళ్ళీ ఐదు నిముషాలవరకూ ఎవ్వరూ మాట్లాడలేదు.

'వెన్నెల బాగుంది కదూ!' అంది పద్మ మళ్ళీ.

'ఊఁ.' అని మాత్రం అన్నాడు' చేతులు వెనక్కి పెట్టుకుని నడుస్తున్నాడు.

ముగ్గురూ నడుస్తున్నారు.

కథ ఎలా మొదలుపెట్టాలో ఆలోచిస్తున్నాడు సుబ్బారావు. అతని మనస్సులో వెన్నెల చాలా తియ్యగా కురుస్తోంది.

విశ్వపతికి ఈ వెన్నెల గమ్యం చేరుకున్నాక ఎలాగుంటుందో మరి !

ఊరలూ గుజాలూ!

# కోడి మాంసము

కూత పెట్టకుండా వుండే యీడుగల కోడిపుంజు మాంసంచాలా శ్రేష్ఠమయినది. శుభ్రమైన రక్తాన్ని పుట్టిస్తుంది. శరీరంలోని ఉష్ణాన్ని క్రమపరుస్తుంది. నీరసంగా వుండేవారికి, ఉష్ణతత్వం గల వారికి యిది అనుకూలమయినది. మంచి యౌవ్వనంలో వుండే కోడిపుంజుమాంసం అధికశక్తి నిస్తుంది. బుద్ధి బలాన్ని అభివృద్ధి చేస్తుంది. వీర్యాన్ని పెంపొందిస్తుంది. కాల్చిన మాంసం దగ్గుగల వారికి మేలు చేస్తుంది. మట్టిని తినాలనే వాంఛను పోగొడుతుంది. వాతతత్వం గల వారికి అనుకూలంగా వుంటుంది. ముదిరిన కోడిపుంజు మాంసం బాగా కాక చేస్తుంది. శ్లేష్మాన్ని, పైత్యాన్ని హెచ్చిస్తుంది. కాక తత్వం గలవారికి ఒంటి పార్శ్వనొప్పి కల్గిస్తుంది.

బాగుగా వండిన కోడిపెట్ట మాంసం చమురు కలిగి రుచిగా గురుత్వంగా వుంటుంది. వాత శ్లేష్మాలను విడగొడుతుంది. వీర్యపుష్టిని, బలాన్ని చేకూరుస్తుంది నేత్రరోగులకు మేలు చేస్తుంది. మంచి రక్తాన్ని పుట్టిస్తుంది. ఇంద్రియాన్ని బాగా ఉత్పత్తి చేస్తుంది. బాగా ఉడకకపోతే యిందుకు వ్యతిరేక గుణాల నిస్తుంది. ముసలికోడిపెట్ట మాంసం కడుపును మృదువు పరుస్తుంది. కడుపునొప్పి, శూలను ఉపశమింపజేస్తుంది.

కోడి పొరగొట్టని 'పిల్ల' మాంసం కాయిలా పడి లేచిన వారికి, నీరసపడ్డవారికి, విషపైత్యమున్న వారికి, జ్వరమున్న వారికి మేలు చేస్తుంది. సంతానయోగ్యతకల్గ జేస్తుంది.

ముదురు కోడిపెట్ట మాంసం కా చేస్తుంది. దగ్గును, శ్వాసను హెచ్చిస్

దీని దుర్గుణాలకు విరుగుళ్ళు:—1. [illegible]లును 2. సికింజబిను 3. సిర్కా

— సేకరణ ఆకుండి నారాయణమూర్తి

# మల్లెలు ఎర్రగులాబీలు

యర్రం చంద్రశేఖరం

## జరిగిన కధ

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకు ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుంచి తనే పెంచి పెద్ద చేస్తాడు లక్ష్మయ్య గారికి గుండె జబ్బు వస్తుంది ఆయనకు శ్రమ యివ్వకుండా వుండటానికి రామం చదువు హెచ్. ఎస్. సి. తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది శారద విషాదగాధ శాంతను కదిలించి వేస్తుంది శాంత బలవంతం మీద శారద కూడా ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరుతుంది. ప్రభాకరానికి నీరజకు పెళ్లి చెయ్యాలని అందరి సంకల్పం. సెలవులకి శాంతతో వచ్చిన శారద సత్ప్రవర్తనతో అందరి అభిమానమూ సంపాదించు కుంటూంది.

## 6

'కమాన్‌డియర్...! ఈ రోజు మా యింటికి పదవే...!'

'ఎందుకులే ప్రభాకర్...! నన్ను చూసి మీయింట్లోవారేమైనా అనుకుంటారేమో?' సంకోచపడుతూ అంది శారద.

'ఎవరేమనుకుంటే మనకేమిటి? అయినా [illegible] నీవు ధరించిన దుస్తులు చూసి [illegible] అవి పోల్చుకోవడం [illegible] వెడదాం. అంతగా చూస్తే [illegible] మనకేంభయం...? ధైర్యంగా [illegible] మిద్దరము 'వుడ్ బి' అని.

[illegible] నీకంత [illegible] ర్యంగా ఉంటే [illegible] ందుకు [illegible] కావాలి [illegible] పద. వెడదాం?'

ఇద్దరూ హోటలునుం[illegible] బయల్దేరుతుండగా అప్పుడే ఎదురుగా వస్తూన్న టాక్సీని ఆపి అందులో యింటికి బయలుదేరారు.

రాత్రి ఎనిమిదైంది. హాలులో శ్రీపతిగారు, నీరజ కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. ప్రభాకరం వెనకనే మేడపైకి వెళ్లిన రోజాను చూస్తూ 'చూడమ్మా నీరజా! ప్రొద్దునపగా వెళ్లాడు. ఇప్పుడెవరో స్నేహితుడితో యింటికి వచ్చాడు. మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదు.'

'స్నేహితుడు కాదు మామయ్యా! స్నేహితురాలు. ఎవరో క్రిస్టియన్ అమ్మాయిలా ఉంది. మెడలో శిలువగుర్తు ఉన్నగొలుసు కనుపించింది.'

'ఏమిటి...? అమ్మాయా! అదేమిటే? ఇప్పుడు ప్రభాకరంతో పైకి వెళ్లింది అబ్బాయి కాదూ?' విస్మయంతో ప్రశ్నించారు శ్రీపతిగారు.

'అబ్బే! కాదు మామయ్యా! అమ్మాయే! మగదుస్తుల్లో ఉంది.'

'అలాగా! అయితే యిప్పుడే వెళ్లి అంతు తేల్చేస్తాను. చొప్పదామిలో నిప్పును దాచినట్లు వీడు నాయింట్లో యిటువంటి అప్రాచ్యపు పనులు చేస్తున్నాడా...? ఇంకేముంది వంశప్రతిష్ఠ. తగలబడిపోతే!' శ్రీపతిగారికళ్లు నిప్పులు కురిపించాయి.

'మామయ్యా! ఆవేశపడకు. చెలిమిన చేదు తినిపించవచ్చుగాని బలిమిన పాలు త్రాగించలేము. ఆవేశం అన్నివిధాలా చెరుపు.'

'ఎన్నిసార్లో నచ్చచెప్పాను తల్లీ! వింటేనా...? చేసేవన్నీలోపాలు, చెపితే కోపాలు అన్నట్లు గట్టిగా మాట్లాడితే ఖస్సుమంటాడు. చిలికి చిలికి పెద్ద గాలివానగా మారుతుందేమోనని యింతవరకూ ఓర్పువహించి ఊరుకున్నాను. ఇక లాభంలేదు బయట ఎలా తగలడినా సహించి, కన్నపుత్రుడనుకుంటే కాళ్ళమీద పడుతుంటాడని ఎంతో సహనంతో నెట్టుకు వస్తున్నాను.' కన్నీరు నింపుకున్నాయి వారికళ్లు.

శ్రీపతిగారి పరిస్థితికి నీరజ జాలి పడింది. అంతకన్న ఆమెమాత్రం ఏం చేయగలుగుతుంది? ఒకటి రెండుసార్లు ప్రభాకరానికి ఏదో నచ్చజెప్పపోయి భంగపడింది కూడా.

'మామయ్యా చిక్కుడుతీగకు బీరకాయ కాస్తుందా...? బావ మంచివాడే! ఎలాగైనా అతనిని ఈ పరిసరాలనుండి తప్పించి వేరే ఎక్కడైనా ఉంచి చదివిస్తే బాగు పడతాడేమో? గొంగట్లో అన్నం తింటూ వెంట్రుకలను ఏరినట్లు అతని చెడు స్నేహాలను మాన్పించకుండా అతనిని నిందించి ఏం ప్రయోజనం? ఇక్కడ ఉంటే ఆ స్నేహాలు మాన్పించడం చాలా కష్టం! నీవుకూడా బాగా ఆలోచించు.'

'కొరివి పెట్టేవాడు కొడుకు, కూడు పెట్టేది కూతురు—అని ఒక్కగానొక్క కొడుకు. వాణ్ని ఒదిలి ఉండాలంటే మాకు మనసు ఒప్పడంలేదు. మీ అత్తయ్య అసలు ఒప్పుకోదు. ఏంచేయాలో తోచడంలేదు అయినా నీ సలహా పాటించే ప్రయత్నంలో ఉంటాను. కొంచెం తడిస్తే చలిగాని కోకంతా తడిస్తే ఏం చలి అన్నట్లు ఇప్పటికే నిండా మునిగి ఉన్నాను. వాడు దూరమౌతాడనుకుంటే అసలుకే మోసం వచ్చేటట్లుంది' అని

పాపోయారు శ్రీపతిగారు.

క్రింద హాలులో కూర్చొని శ్రీపతిగారు నీరజ అతని విషయం ఆలోచిస్తూ ఉంటే పైన గదిలో రోజా, ప్రభాకరం ఇద్దరూ కబుర్లలో మునిగి తేలుతున్నారు.

'డియర్...! క్రింద హాలులో కూర్చున్న ఆ అమ్మాయెవరు?'

'మా మేనగోడలు. ఆ పాచి పీనుగ శారదను ఒదిలించుకుంటే యిప్పుడు ఈ పిల్లొకటి నా ప్రాణానికి. మొన్న ఏవో నీతులు చెప్పాలని ప్రయత్నించింది. మళ్లీ ఈ జన్మలో నా జోలికి రాకుండా కుక్క కాటుకి చెప్పుదెబ్బలా తిప్పికొట్టాను. అంతే! ఇక నా ఊసెత్తడంలేదు.'

'భలే! నాకు తెలుసు. నీ వటువంటి వాడివని. అందుకే నా కోసం ఎంతోమంది అర్రులు చాస్తున్నా నా హృదయంలో నీకు ప్రథమస్థానమిచ్చాను' కళ్ళు విచి ప్రెంగా తిప్పుతూ అంది రోజా. ఆమె మాటలలోని యదార్థాన్ని గ్రహించలేని ప్రభాకరం. 'థాంక్స్ రోజా ... నేను ధన్యుణ్ని' అని రోజా కుడిచేతిని సున్నితంగా ముద్దాడాడు.

'ప్రభాకరం మన పరిచయం కలిగి కొన్ని వసంతాలు గడిచాయి. అయినా మన ప్రేమచిహ్నంగా నాకు బహుమానమేదీ యివ్వలేదు.' ఆశగా ప్రభాకరం కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించింది రోజా.

'నన్ను మించిన బహుమానమింకేం ఉంటుంది రోజా...! నన్ను నేనే నీకు సమర్పించుకున్నాను.' చిలిపిగా రోజా కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు ప్రభాకరం.

'అది నిజమే ప్రభాకర్...! నేను కాదనను. కాని నీవు దగ్గరలేనప్పుడు కూడా నా హృదయంలో నీవే మెదలాలంటే నీ ప్రేమ చిహ్నమొకటి నా దగ్గర ఉండొద్దూ...?' అని ప్రభాకరం కళ్ళల్లోకి మత్తెక్కించేలా చూస్తూ అతనిని రెచ్చగొట్టసాగింది.

రోజాను ఆ స్థితిలో చూసిన ప్రభాకరం ఉక్కిరి బిక్కిరయ్యాడు. 'అలాగే రోజా. ఏం కావాలో కోరుకో?'

'తప్పకుండా నా కోరిక తీరుస్తావా?'

'ఆం...? ఎందుకొచ్చిందా సందేహం?'

'ఏం లేదు. ఆ తర్వాత వెనుకకు పోకూడదు. నా చేతిలో చేయివేసి మాటయివ్వు.' చేతిని ముందుకు చాస్తూ అంది రోజా.

'రోజా! మాట తప్పటం ఈ ప్రభాకరం జీవితంలోనే జరగని పని. అయినా నీతృప్తి కోసం అలాగే చేస్తాను' అని ముందుకు చాచిన ఆమె చేతిలో తన చేతినివేసి మృదువుగా నొక్కాడు.

మత్తుగా రెప్పలు ఆర్పింది రోజా—

'డియర్! మొన్న ఒక నెక్లెసును చూశాను. ఎంత బాగుందనుకున్నావ్...! జీవితంలో పెట్టుకుంటే



తెచ్చేవరకే నెక్లెస్ పెట్టుకోవాలి! దాన్ని చూసినప్పటినుండి మన ప్రేమ చిహ్నం అదైతే బాగుంటుందనే ఊహ నాకు కలిగింది. ఏమంటావ్?' సోఫాలో వాలుగా కూర్చున్న ప్రభాకరం షర్టు కాలరును సరిజేస్తూ లేని ఆప్యాయతను ఒలకబోస్తూ అంది.

'దాని వెల ఎంతేమిటి?' మెత్తగా ఆమె అందాన్ని తనకళ్లతో జుర్రుకుంటూ అన్నాడు ప్రభాకరం.

'ఆఁ... ఎంతోలేదు. రెండు వేలు మాత్రమే!' నిర్లక్ష్యంతో అంది రోజా.

ఉలికి పడ్డాడు ప్రభాకరం. మత్తు వదిలింది సరిగా కూర్చున్నాడు. 'రెండు వేలే...!' అతని ప్రమేయం లేకుండానే అతని పెదవుల నుండి ఆ మాటలు వెలువడ్డాయి. ముఖం ప్రేలాడేసుకున్నాడు.

'అంతడబ్బు ఏ వంకతో నాన్నగారిని అడగమంటావ్...? ఇప్పటికే ఆయనగారు నామీద కాగాలు మిరియాలు నూరుతున్నారు రెండువేలు అడిగితే యింకేమైనా ఉందా? మంచి ఉంగరం ఒకటి ప్రజంట్ చేస్తాను అదే మన ప్రేమ చిహ్నం. సాధారణంగా ప్రేమచిహ్నాలుగా ఉంగరాలే యిస్తూ ఉంటారుగదా!' నచ్చచెప్పేధోరణిలో అన్నాడు ప్రభాకరం.

'బోడి ఉంగరం ఎవరికి కావాలి? మన ప్రేమ అసాధారణమైనది. అటువంటప్పుడు సాధారణ బహుమతికి అర్థం ఉండదు. పోనీలే ప్రభాకర్! నా కోసం మీ నాన్నగారితో పేచీ ఎందుకు తెచ్చిపెట్టుకుంటావ్? నాకు ఉంగరమూ వద్దు నెక్లెసూ వద్దు. నీవుంటే చాలు.' ముఖం మాడ్చుకొని, చిరుకోపం నటిస్తూ, బుంగమూతి పెడుతూ అంది.

'రోజా! నీవలిగితే నే భరించగలనా? అలాగే! నీవు కోరినది తల తాకట్టు పెట్టయినా యిస్తాను!' గుండె గుబగుబలాడుతున్నా పెదవులపై నుండి వచ్చాయి మాటలు.

'వద్దులే ప్రభాకర్! నాకోసం నీవు ఇబ్బంది పడడం సహించలేను జీవితాంతం నీవు, నేను యిలా కలసి ఉండడమే నాకు ముఖ్యం.' బలవంతాన తన కోరికను నివురుగప్పిన నిప్పులా అణచి పెడుతూ అంది రోజా.

# పంత్లైలు...

'లేదు నీ కోరిక తీర్చి, నిన్ను సంతోషపెట్టలేక పోయిననాడు నా యీ జీవితమే వృధా...! నీ సంతోషమే నా సంతోషం! నీకోసం ఏమైనా చేస్తాను. రోజా...! నారోజా...!' తన దృఢ నిర్ణయాన్ని తెలియపరిచాడు.

అకస్మాత్తుగా తన వాచీ చూసుకున్న రోజా అదిరిపడి 'ప్రభాకర్! చాలా ప్రొద్దుపోయింది. మమ్మీకి ఏం సంజాయిషీ చెప్పుకోను? వెళ్లొస్తాను. ఎల్లుండి నా పుట్టిన రోజు. నీకోసం నేను కళ్ళతో ఎదురు చూస్తూ ఉంటాను. నే కోరినది యివ్వలేకపోతే బాధపడకు. నీవు మాత్రం తప్పకుండా రావాలి. నెక్లెసు కోసం లేనిపోని ఇబ్బందులు తెచ్చిపెట్టుకోకు' అని ప్రభాకరం నుదురుపై పడిన క్రాపును ఉంగరాలలా మెలివేస్తూ, వయ్యారం ఒలికిస్తూ క్రిందికి దిగింది రోజా సాగనంపడానికి ఆమెననుసరించాడు ప్రభాకరం. ఇదంతా నీరజ ఒక కంట కనిపెడుతూనే ఉంది.

* * *

'అమ్మా! నీరజ నేను, మీ నాన్న అలా బయటికి వెళుతున్నాం. జాగ్రత్తమ్మా!' సుందరరామయ్యగారితో బయటికి వెళుతూ అన్నారు శ్రీమతిగారు.

'అలాగే మామయ్యా!' అని లోపల ఎక్కడో ఉన్న నీరజ బయటికి వచ్చి హాలులో సోఫాలో కూర్చుంది. ఆరోజు కాలేజీకి ఏదో శలవు. ప్రభాకరం పైన తన గదిలో కూర్చొని ఆలోచనలో పడ్డాడు. ఉదయం పది దాటింది రోజా బర్త్‌డే ఆరోజే! ఆమె కోరిన నెక్లెసు విషయమై ఆలోచిస్తూ ఉన్నాడు. 'ఏమిటి చేయడం? ఒక గంటముందుగా వెళితే తప్ప ఆ నెక్లెసు కొనడానికి వీలు పడదు. సాయంత్రం ఇంటికి పార్టీ. ఈలోగా రెండువేలు ఎలా సాధించడం? ఎటూ పాలుపోవడం లేదు. నెక్లెసు తీసుకు వెళ్లకపోతే రోజా బాధపడుతుంది అబ్బ! రోజాను బాధపెట్టి నేను సంతోషంగా ఎలా ఉండగలను? ఎక్కడైనా అప్పు చేస్తే? ఎవరిస్తారు? వద్దు, దొంగతనమైతే ఎలాగో బాధపడవచ్చు రెండు వేలంటే మాటలా? ఏమిటబ్బా చేయటం? చూస్తాను. ఒక్కొక్కసారి నాన్నగారు మతిమరుపుతో తాళాలు యినపెట్టెకే ఉంచి వెదుక్కుంటారు. ఈ రోజు అలా జరుగుతే బాగుంటుంది అలా ఎందుకు జరుగుతుంది? ఒకవేళ జరిగినా రెండువేల రూపాయలు తీస్తే తెలియకుండా ఉంటుందా? తెలిస్తే తెలిసింది. రెండు రోజులు ఓర్చుకుంటే చాలు. ఆ తర్వాత మామూలుగానే మరచిపోతారు. అయినా మాకు రెండువేలు ఒక లెక్కలోవా? చూస్తాను. తాళం చేతులు ఉంటే నేనదృష్టవంతుడనే!' అని ఆలోచిస్తూ మెల్లగా లేచి క్రిందికి దిగివచ్చాడు. నీరజ సోఫాలో కూర్చొని ఉంది ఏదో ఆలోచనలో ఉండడంవల్ల ప్రభాకరం దిగివచ్చిన సంగతి ఆమె వెంటనే గుర్తించలేక పోయింది. అన్నపూర్ణమ్మగారు వంట గదిలో ఉన్నారు. సడీ చప్పుడు కాకుండా మెల్లగా శ్రీపతిగారి గదిలోపలికి వెళ్ళాడు ప్రభాకరం. పైగా శారద ఉన్న గదినే నీరజ ఉండడానికి ఏర్పాటు చేశారు. కొద్దిసేపైన తర్వాత తన గదినుండి ఏదైనా నవల తెచ్చుకోవాలనే ఉద్దేశంతో లేచింది నీరజ. సవ్వడి విని తలుపువారగ నక్కాడు ప్రభాకరం. నీరజ తన గదిలోపలికి వెళ్ళింది. అప్పుడే ఆమె బయటికి రాదనుకున్న ప్రభాకరం యినపెట్టెవైపు చూస్తూ అడుగులు ముందుకు వేశాడు. అతని సంతోషానికి అవధులు లేవు తాళం చెవులు యినపెట్టెకే ఉన్నాయి. సంతోషంతో, వణుకుతూన్న చేతులతో పెట్టె తెరిచాడు. రెండు కట్టలు పది రూపాయలవి తీసుకున్నాడు. ఇనపెట్టె తలుపు యథాప్రకారం వేశాడు. ఆ కట్టలు రెండూ తనకు వెనుకప్రక్కగా పెట్టుకొని బయటికి వస్తున్నాడు. నవల చేతిలో పట్టుకొని నీరజకూడా అప్పుడే బయటికి వస్తూ ప్రభాకరం చేసినదంతా చూసింది. కాని ఏమీ ఎరగనట్టు ఊరుకుంది. ఆ సమయంలో ఏదైనా గొడవ చేస్తే పరిస్థితి విషమిస్తుందని నీరజకు తెలుసు. ప్రభాకరం దొంగగా నిరూపించబడతాడు. అయినా ఊరుకోకుండా 'ఏం బావా? మామయ్య గదిలో ఏం చేస్తున్నావు?' సూటిగా ప్రభాకరం కళ్లల్లోకి చూస్తూ ప్రశ్నించింది. ఆ ప్రశ్నకు తడబడ్డాడు. ఒళ్లంతా ముచ్చెమటలు పోశాయి. వణుకుతూన్న

క్వరంతో 'నీరజా! నీవా? ఇక్కడేం చేస్తున్నావు? నేను నాన్నగారున్నారేమోనని వారి గదిలోకి వెళ్ళాను కాని వారు అక్కడ లేరు, ఎక్కడికి వెళ్ళారు?' కంగారు పడుతూ నీరజను ప్రశ్నించాడు.

చిరునవ్వు నవ్వింది నీరజ. 'ఏంబావా అంత కంగారుపడుతున్నావ్? అది చెప్పటానికి వీలుకాదేం?' తన పెదవులపై చిరునవ్వు లాస్యంచేస్తూ ఉండగా హాలు వైపు నడిచింది. వెనుకగా నడుస్తున్న ప్రభాకరం ఆ రెండు కట్టలు రెండు జేబులలో పెట్టుకొని నీరజను అనుమానిస్తూ పైకి వెళ్ళాడు. అతను పైకి వెళ్ళగానే నీరజ గాభరా పడసాగింది. ఆ సమయంలో తన మావయ్య వస్తే ఎంతో బాగుండునని ఆలోచిస్తూ ఏమీ తోచక తత్తరపాటుతో పచార్లుచేయడ మారంభించింది.

'మావయ్యకు చెప్పడమా? మానడమా? చెబితే గొడవ జరుగుతుంది ప్రభాకరం రెండువేలు ఏంచేస్తాడో? ఏమో? అతను తీస్తూ ఉండగా కేకలు వేద్దామనుకున్నాను. కాని నలుగురికీ తెలుస్తే కుటుంబం గౌరవం పాడౌతుందనే ఊహ తట్టింది. కొద్ది మొత్తమైతే మావయ్యకు తెలియదు. ఇంత మొత్తం తీసినప్పుడు ఆయనకు తెలియకుండా ఉంటుందా? సరే! చెప్పవలసిన అవసరమొస్తే తప్ప, నా అంతట నేను చెప్పను. మొదట చెప్పలేదని మావయ్య ఏమనుకుంటాడో?' పరిపరివిధాల ఆలోచిస్తున్న నీరజకు తన తండ్రి, మావయ్య వస్తూ ఉండడం కనిపించింది. ఏమైతే అదౌతుందని ఈ విషయం శ్రీపతిగారికి చెప్పడానికే నిశ్చయించుకుంది. శ్రీపతిగారు లోపలికివస్తూనే నీరజ ముఖంలో కనుపిస్తున్న ఆందోళనను గుర్తించారు.

'ఏమిటే నీరజా!... అలా గాభరా పడుతున్నావేం?'

'మావయ్యా! ఇలా రా!' అని శ్రీపతిగారిని తనతో తన గదికి తీసుకువెళ్ళి విషయమంతా విడమర్చి చెప్పింది. ఆవేశంతో ఊగిపోయారు శ్రీపతిగారు. పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకున్న నీరజ 'మావయ్యా! త్వరపడి కేకలు వేయకు. ఏ రహస్యమైనా గుప్పిట్లో

ఉన్నంతవరకే! విప్పితే అంతా రసాభాసై పోతుంది. ఇదివరకు ఉన్న చెడ్డపేరుకు యిదికూడా తోడౌతుంది. అతని చేతికి వెళ్ళినడబ్బు ఎలాగూ తిరిగిరాదు. అంతే కాకుండా అవసర ఆవేశాలతో యిప్పుడున్న ఈ మంచి సంబంధాలు కూడా చెడిపోతాయి. పరిస్థితి చాలా నాజూకుగా ఉంటుంది. డబ్బు అవసరానికి మించి యింట్లో ఉంచకు, ఉంచినకొద్దీనా అతనిచేతికి చిక్కకుండా జాగ్రత్తపడు. ఇంతకన్న యిప్పుడు చేయగలిగిందేమీ లేదు. ఈ నామాటలు చాలా జాగ్రత్తగా ఆలోచించి చూడు.' అని శ్రీపతిగారి ముఖంలోకి చూడసాగింది నీరజ.

పదినిముషాలు బాగా ఆలోచించిన శ్రీపతిగారు. 'అవునమ్మా! చిన్నదానివైనా చక్కగా చెప్పావ్! కాని యిలా యింతకాలం సాగుతుంది? నేనేం చెయ్యాలి?' మదరు కొట్టుకుంటూ బాధపడ సాగారు. వారిబాధను చూడలేక ఓదించు ...ది నీరజ—

* *

రోజా బర్త్‌డే ఏర్పాట్లు ఘనంగా జరిగాయి. రోజా తన గదిలో ఒంటరిగా ఉన్న సమయం చూసి ప్రభాకరం ఆమె మెడ నెక్లెసు అలంకరించాడు.

'అబ్బ! ఎంత బాగుంది ప్రభాకర్! నాకోరిక తీర్చావ్!' ప్రభాకర్ని తన దగ్గరకు తీసుకుంటూ అంది. రోజా.

'రోజా! ఈరోజు ఈ దుస్తుల్లో ... అందంగా ఉన్నావు?' అరవిచ్చిన కమలంలా ఉన్న ఆమె ముఖాన్ని తన రెండు చేతులతో పట్టుకొని, ఆమె కళ్లల్లోకి ఆత్రంగా చూస్తూ, తనవైపు జరుపుకుంటూ అన్నాడు.

'ప్రభాకర్! మన ఈ ప్రణయనౌకకు ఏ వంటి తుఫానులూ అడ్డు రాకుండా ఏర్పాటు చేసుకుందాం. ఏమం...?' ఉప్పెనలా పొంగుతూన్న ఆవేశం బలవంతంగా అణగద్రొక్కుతూ రోజా.

'త్వరపడితే ఎలా? సమయం రావద్దూ! యింట్లో బహుశా. దీనిని అంతా ...' మెల్లిగా నచ్చజెప్పి మనం వివాహం చేసుకుందాం! నాన్నగారితో మాట్లాడుతాను.'

## మంగళం...

'అలాగే నీ యిష్టమే నాయిష్టం!' కళ్లల్లో కాంక్షను నింపుకొని అంది రోజా.

ప్రభాకరంలో ఒక సద్గుణముంది. ఎన్ని చెడు తిరుగుళ్లు తిరిగినా, రోజాను మెప్పించడానికి దొంగతనం చేసినా, త్రాగుడు అలవాటు చేసుకున్నా, శీలాన్ని మాత్రం చెడగొట్టుకోలేదు. ఒకటి రెండు సార్లు రోజా బలవంతం చేసినా నవ్వి జెప్పి తప్పించుకున్నాడు. రోజా అతనిని ఎంత కవ్వించినా, ఉత్తేజ పరచినా అతను మాత్రం హద్దుమీరి ప్రవర్తించడం లేదు.

ప్రభాకరం ఆరోజు రోజా యింటి నుండి బయట పడే సరికి రాత్రి పది దాటింది. ఆమె బలవంతం చేయడంవల్ల కొద్దిగా త్రాగాడు. కారును నెమ్మదిగా డ్రైవు చేసుకుంటూ యింటికి వచ్చాడు. పైన ఉన్న తన రూముకు వెళ్లాలని నాలుగు మెట్లు ఎక్కాడు.

'ప్రభాకరం!...ఇలారా!' తండ్రి పిలుపు వినిపించింది. ఆ పరిస్థితిలో తన తండ్రికి ముఖం చూపించడం యిష్టంలేక వినపడ నట్లు నటిస్తూ మెట్లు ఎక్కసాగాడు.

'ఒరేయ్ ప్రభాకరం! నిన్నే పిలిచేది. పిలుస్తూ ఉంటే వినిపించుకోకుండా అలా వెడుతున్నావేం?' కంఠస్వరంలో కాఠిన్యాన్ని హెచ్చిస్తూ అతనిని రెండవసారి పిలిచారు శ్రీపతిగారు.

ఇక తప్పదనుకుంటూ దిగి వచ్చాడు ప్రభాకరం. తన ఎదురుగా నిల్చున్న ప్రభాకరాన్ని కోపంగా చూస్తూ 'అలా కూర్చో! నీతో మాట్లాడాలి' అన్నారు శ్రీపతిగారు

'రేపు ఉదయం మాట్లాడుకుందాం మంచి నాన్నగారూ! ఇప్పుడు నాకు బాగా నిద్రవస్తూ ఉంది' బొంకి తప్పించుకోవాలని చూశాడు ప్రభాకరం.

'అదేమీ కుదరదు. ఇప్పుడే మాట్లాడాలి. ఉదయం ఇనప్పెట్టెలోనుండి తీసిన ఆ రెండువేలు ఏంచేశావ్! ఇంతవరకూ నీవు దుడుకువాడవనీ, ఏదో అల్లరిగా బాధ్యతారహితంగా మాత్రమే తిరుగుతున్నావని మాత్రమే ఊహించాను. ఇప్పుడు దొంగతనంచేయడం కూడా మొదలు పెట్టావన్నమాట: అయ్యో! ఇప్పుడు గుర్తుకు వస్తూ వుంది. ఆ రోజుకూడా నీవే ఇలా దొంగతనం చేస్తూ శారదకు పట్టుబడి పోయావు. నిన్ను దొంగగా నిరూపించడం యిష్టం లేక అన్నెం పున్నెం ఎరుగని ఆ అమాయకురాలు తను చేయని నేరాన్ని తనపై మోపుకొని ఎటో వెళ్ళి పోయింది.'

'అవును. అప్పుడు ఆ వేయి రూపాయలు నేనే తీశాను. ఈ రోజు రెండు వేలూ నేనే తీసుకున్నాను. నేను రెండు వేలు తీయడం నీరజ చూసింది. ఆమె మీతో చెబుతుందనికూడా నాకు తెలుసు. నాకు ... డబ్బుతో అవసర మొచ్చింది. తీసుకున్నాను. నా డబ్బు నేను తీసుకోవడంలో తప్పు లేదు.' మొండిగా సమాధాన మిచ్చాడు ప్రభాకరం.

శ్రీపతిగారు కళ్లెర్రజేసి ఆవేశంతో ఏదో మాట్లాడబోయారు. పరిస్థితులు విషమిస్తాయని గ్రహించిన నీరజ — 'మామయ్యా! రేపు అన్ని విషయాలూ మాట్లాడుకోవచ్చు. ఇప్పుడేమీ త్వరపడ వద్దు', అన్నది.

'ఇందులో నీ పెత్తనమేమిటి? బోడి పెత్తనం? ఇప్పుడే మాట్లాడుకుంటాం. ఏని ...లేక యిటువంటి పెత్తనాలు యెందుకు చేస్తుంటారో నా కర్మం కాదు.' ముఖం మాడ్చుకుని చిటపట లాడుతూ అన్నాడు ప్రభాకరం.

'అవున్నా...పెత్తనం దానిదే! రేపు జీవితాంతం నీతో గడప వలసింది అదే కద! దాని మాటలో తప్పేముంది? ఐనా ఆ రెండు వేలూ ఏం చేశావ్? ఎక్కడ తగలబెట్టావ్?'

'రోజాకు నెక్లెసు కొని యిచ్చాను. ఇక దానికమెందుకు నాన్నారూ? నేను రోజాను పెండ్లి చేసుకోవా లనుకుంటున్నాను. నీరజను చేసుకోను. మీరు ఆశీర్వదించి మా యిద్దరిని ఆదరిస్తే సంతోషిస్తాను.' కొంచెం తగ్గి అన్నాడు ప్రభాకరం.

'ఛీ!......అదేవలెరా...ఈ యింట్లో అడుగు పెట్టడానికి? మన వంశము, గౌరవ ప్రతిష్ఠలు ఏమైనా దృష్టిలో ఉంచుకొని మాట్లాడుతున్నావా? ఇటువంటి పనులు చేసి నన్ను నలుగురిలో

తలెత్తుకొని తిరగకుండా చేస్తావని భయపడుతూనే వున్నాను. అనుకున్నంతా అయింది. నీవు బుద్ధిగా చదువుకొని పేరును పెళ్ళాడితే సరి! లేకపోతే ఆస్తంతా ఆశ్రమాలకు వ్రాసిచ్చి, మీ అమ్మ, నేను యింత విషం తింటాం.' ఆవేశంతో ఊగిపోతూ అన్నారు శ్రీపతిగారు. కోపంతో లేచి పైకి వెళ్ళిపోయాడు ప్రభాకరం.

*　　*　　*

శాంత, శారదలిద్దరూ క్రమంగా కాలేజీకి వెడుతూ చక్కగా చదువుకుంటున్నారు. శారద స్నేహంతో శాంతకు చదువుపై యిదివరకటికన్న ఎక్కువ శ్రద్ధ పెరిగింది. మొదట్లో శారదను పుస్తకాల పురుగుగా దెప్పుతూ వుండే శాంత యిప్పుడు తనుకూడా ఆ విధంగానే మారింది. క్లాసు కంతటికీ శారద, శాంత లిద్దరే ఎక్కువ మార్కులు సంపాదిస్తున్నారు. ఆ సంవత్సరం వార్షికోత్సవాలలో జరిగిన వక్తృత్వ పోటీలలో శారద పాల్గొంది. ఆమె వాదనాపటిమ, విమర్శనా విధానం ఆ వార్షికోత్సవాలకు అతిథులుగా వచ్చిన సాహిత్యవేత్తలకు సంభ్రమాశ్చర్యాలను కలిగించాయి. మన సంస్కృతి సభ్యతలమీద ఆమె యిచ్చిన ఉపన్యాసము యువకులను, పెద్దలను ఆకర్షించింది. ముఖ్య అతిథి బహుమతి ప్రదానంచేస్తూ ఆమెను ఎంతో పొగిడారు. చక్కగా కృషిచేస్తూ వెనుకబడిన మన సాంప్రదాయాలను, ఆచారాలను మళ్ళీ పునరుద్ధరించడం చాలా అవసరమనీ, అందుకు యిటువంటి యువతరంవారు పూనుకోవడం ఎంతో హర్షదాయకమనీ తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అంత మందిలోనూ శారదను పొగడడం శాంతకు గర్వకారణమైంది.

పరీక్షలు యింకా నెలరోజు లున్నాయి. ఇద్దరూ బాగా చదువుకుంటున్నారు. ఇద్దరిలోనూ పట్టుదల ఉత్సాహం ఎక్కువయ్యాయి. ఒకరిని మించి మరొకరు ఎక్కువ మార్కులు సంపాదించుకోవాలనే కోరిక యిద్దరిలోనూ ఎక్కువైంది. శారద మొదటినుండీ తెలివిగలది కాబట్టి, తను పూర్వం ఉన్న సబ్జెక్టులలో ఆమె సహాయాన్ని తీసుకుంటూ తీవ్రమైన కృషి చేస్తూ ఉంది శాంత. ఆమెలోవచ్చిన ఈ మార్పుకు ఎంతో సంతోషించింది శారద.

ఒకరోజు సాయంత్రం యిద్దరూ సుల్తాన్ బజార్‌లో తమకు కావలసిన సామానులు ఏవో కొనుక్కుంటున్నారు.

'శాంతా! బాగున్నావా?'

'ఎవరు ...?' వెనుతిరిగి చూసింది శాంత.

'నేను ... సుందరాన్ని!' చిరునవ్వు ముఖంతో కనుపించాడు సుందరం.

'నీవా ...? ఎంత మారిపోయావు? నిన్నుచూసి చాలా కాలమైంది కదూ...!' సంభ్రమాశ్చర్యాలను ప్రకటిస్తూ అంది శాంత.

'అవును. శలవులలోకూడా యింటికి రావడంలేదు. రామం బాగున్నాడా ... వాడికైనా ఉత్తరం వ్రాద్దామనుకుంటుంటాము. అలా అనుకుంటూ ఉంటుండగానే ఏండ్లు గడిచిపోతున్నాయి.'

'డాక్టరువు కాకముందే అంత తీరిక లేకపోతే, డాక్టరువైన తర్వాత మాబోటి వాళ్ళతో మాట్లాడడానికి కూడా వీలు చిక్కదనుకుంటాను. అంతేకాక యిక మన ఊరినికూడా మరిచిపోతావేమో?' నవ్వుతూ అంది శాంత.

'అబ్బే! అదేంలేదు శాంతా! ఏమిటో ఇక్కడి వాతావరణానికి అలవాటు పడిన ప్రాణానికి ఆ పల్లెలో రెండురోజు లుండాలంటే విసుగు పుడుతుంది. అసలు నాకు



రికార్డింగ్ యంత్రాలు, మైక్రోఫోనుల మధ్య నార్వేజియన్ సెక్సీతార జూలీఏగ్. —(నాఫెన్)

సమాధానం లేదు. 'అబ్బే! అటువంటిదేమీ లేదండీ! సాధారణంగా యువ [illegible] మామూలుగా అబ్బే అలవాట్లనీ...!' [illegible] నవ్వుతూ సమాధానమిచ్చాడు.

శారదతో మాట్లాడిన ఆ కొద్ది సమయంలోనే ఆమె సంగతి పూర్తిగా అర్థం చేసుకున్నాడు సుందరం: ఆమె నేటి నాగరికతకు పూర్తి విరుద్ధమని. ఆ సమస్య అంతటితో ఆగిపోయింది.

'సరే! మరి నీవేం నిర్ణయించుకున్నావు?' సుందరాన్ని ప్రశ్నించింది శాంత.

'ఇంకా ఎక్కడ? హౌస్‌సర్జన్ పూర్తి చేశాక! చాలా సమయముంది నెమ్మదిగా ఆలోచిస్తాను' అన్నాడు సుందరం.

'అదేమిటండీ! పల్లెల్లో పుట్టి, పల్లెల్లో పెరిగారు. బహుశా మీరు ఇక్కడికి వచ్చి ఐదారు సంవత్సరాలు అయి ఉంటుంది. ఈ కృత్రిమ వాతావరణానికి లొంగిపోయి పుట్టిన గడ్డను నిర్లక్ష్యం చేయడం మంచిది కాదు. మీ నిర్ణయం గ్రామీణ [illegible] ఆశయానికి అనుకూలంగా ఉండాలని ప్రార్థిస్తున్నాను. ఇక్కడ డాక్టర్లకు కొదువలేదు. [illegible] ఎక్కడ మీరు [illegible] యిక్కడ మీకు [illegible]. మీరు బాగా చదువుకున్నారు. ప్రత్యేకించి ఒకరు చెప్పవలసినదేముంది...? జాగ్రత్తగా ఆలోచించుకోండి! [illegible] శారద.

శారద మాటల్లో [illegible] సుందరం ఆమె మాట్లాడుతున్నంతసేపు ఆమె మాటల లోని [illegible] ఆశ్చర్యపోయాడు.

'అలాగే ఆలోచిస్తానండీ!' అన్నాడు సుందరం [illegible] శాంత వైపు [illegible] 'ప్రయాణం [illegible]' అని ఒక కాగితం [illegible] వ్రాసి [illegible] సుందరం.

'ప్రయత్నిస్తాను' ముఖావంగా అని [illegible] కాగితం తీసుకుంది శాంత.

సుందరం [illegible], అతనిని గురించి [illegible], శాంత ఒక విధంగా [illegible] వైపు వెళ్ళి బస్సుకోసం నిరీక్షిస్తారు

(ఇంకా ఉంది)

# అతిపరిచయం

ధర్మపథం



**బులుసు వేంకటరమణయ్య**

'అతి పరిచయాదవజ్ఞా' అనేలోకోక్తి ప్రసిద్ధంగా ఉన్నది. ఎక్కువ పరిచయం ఉంటె—ఆ వస్తువు విలువ తెలియక—దానియందు అనాదరభావం ఏర్పడుతుంది—ఇది సహజం.

ఏంతో పుణ్యం సంపాదించ వచ్చుననే అభిప్రాయంతో చాలా చాలా దూర ప్రదేశాలనుంచి జనం పెద్ద పెద్ద పుణ్య క్షేత్రాలకు తండోపతండంగా వెళ్తూ ఉంటారు. కాని ఆ క్షేత్రంలో వున్నవారికి మాత్రం దానిమీద ఇతరులకున్నట్లు గౌరవం ఉండదు. పైపెచ్చు అనాదరమే ఉంటుంది.

మనకు మంచిగంధపుకట్టె దొరకడం కష్టం. అసలు చందనపుకట్టె దొరికితే దానివెల ఎంతో ఎక్కువగా ఉంటుంది. కాని మలయపర్వతంమీద చందనవృక్షాలు విస్తారంగా పెరుగుతాయి. అక్కడ నివసించే ఆటవిక స్త్రీలు చందనపు కట్టెలను వంటచెరకుగా ఉపయోగిస్తారట! అది అంటే వారికి లెక్కలేదు. దీనికి కారణం అతి పరిచయమే!

'అతి పరిచయాదవజ్ఞా
సంతత గమనాదనాదరో భవతి,
మలయే భిల్లపురంధ్రి
చందన తరుకాష్ఠ మింధనం కురుతే'

అనే శ్లోకం ఏర్పడింది.

కాశి క్షేత్రానికివెళ్తే పుణ్యం లభిస్తుందనీ, గంగానదిలో స్నానం చేస్తే ఎట్టి పాపాత్ముడయినా పరిశుద్ధుడౌతాడనీ నమ్మకంతో అసంఖ్యాకంగా జనులు అక్కడికి వెళ్తూ ఉంటారు. అక్కడ నివసించి వుండేవాళ్ళకి గంగానది సామాన్యమైనదిగానే కానవస్తుంది.

'సన్నికర్షో హి మర్త్యానా
మనాదరణ కారణం,
[illegible]
తత్రత్యో [illegible] శుచయే'

అనే పెద్దలమాటను ఈ విషయంలో గమనించవచ్చును.

'ఎప్పుడూ దగ్గరవుండే వాటిమీద మనుష్యులకు అనాదరం ఉంటుంది, అవి ఎంత గొప్పవైనా—ఆ అనాదరణకు కారణం దగ్గిరగా వుండడం మాత్రమే! మానవులు తాము పరిశుద్ధులు కావడంకోసం పవిత్రమైన గంగానదికి స్నానార్థం వెళ్తారు అక్కడ వుండేవారికి గంగాస్నానం [illegible] కలుగదు. వారు తాము పరిశుద్ధులు కా[illegible] అని ఇతరములైన నదులకు స్నానం చెయ్యడానికి వెళ్తారు' అని దీని అభిప్రాయం.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యడం కోసం భగవంతుడు శ్రీకృష్ణుడుగా, యాదవ వంశంలో అవతరించి, తన శైశవాన్ని గొల్లపల్లెలో గడిపాడు. అతడు శైశవంలో చూపిన అద్భుత కృత్యాలకు జనులు చకితులైనా—తిరిగి మాయలో పడి క్షణ కాలంలోనే అతడు భగవంతుడనే విషయాన్ని మరచిపోయేవారు. అద్భుతాలు చూపినప్పుడు మాత్రం ఆయన భగవంతుడనే సంగతి జ్ఞప్తికి వచ్చేది.

శ్రీకృష్ణుడు గ్రేపల్లెనుండి మధురానగరానికి—కంసుని శిక్షించడంకోసం వె[illegible] అతణ్ణి సంహరించి, కొంతకాలం [illegible]లో ఉండిపోయాడు. అతడు అం[illegible]తోనూ కలిసిమెలిసి వున్నప్పుడ[illegible]రణంగా చూచిన గొల్లలకు—అల[illegible] దూరంగా వుండడంవల్ల—అతని [illegible] ఎట్టిదో గ్రహించడానికి అవకాశం [illegible]
[illegible] శక్తిని గోపికలు గ్ర[illegible] అభిప్రాయంతోనే శ్రీకృష్ణు[illegible] కాలం తన పరిచితులకు [illegible]
[illegible]




బారుగా కట్టిన ట్యూబ్‌లైట్ల కాంతుల్లో ధగధగ వెలిగిపోతూ, పట్టపగలులా వుంది పెళ్ళి పందిరి. పందిరి వేసిన పచ్చికొబ్బరాకుల వాసనా, సెంట్లూ, లవెండర్లూ, కర్పూరం, అగరొత్తులూ తదితర పరిమళ ద్రవ్యాల్లో ఆ స్థలం ఘుమఘుమలాడుతోంది. పట్టుబట్టల మెరుపులూ, సిల్కుచీరెల గరగరలూ, నైలాన్, టెరిలిన్ శారీల సొయగాలూ, ఒక వయిపూ, టెరికాటన్ షర్టులూ, ప్యాంట్లూ, పంచెలూ, లాల్చీలూ మరో వయిపూ తమ అలంకారాల్ని, ఆడంబరాల్ని ప్రదర్శించుకొంటూ హడావిడిగా తిరుగుతున్నాయి. కోకనరి చీరెల్లో అందంగా శరీరాల్ని బంధించి, ఎరకైన పెదవుల్ని విరేసి నగల్తో కప్పుకుని, ఉక్కిరి బిక్కిరవుతూ, ఉసన గదుల్లో ఆపసోపాలు పడుతున్నారు కొందరు. పిల్లలు వాకిట్లో గిరాటుల సందడి... ఆ తరవాత సన్నాయి మేళం పాట... కిలకిలా నవ్వులు... పరాచికాలు... సాంప్రదాయాలు... రాగాలు... పురోహితుడి కంఠస్వరం... తాళాల ధ్వనులూ కలగలుపుగా ఆ సందడి మరుక్కుదనం పుట్టి

కాని, ఏదోవిధమైన వుత్తేజాన్ని కలగ చేస్తోంది. పీటమీద పెళ్ళికొడుకు కాటుక కళ్ళతో అగ్నిహోత్రం పొగకి ఉక్కిరి బిక్కిరవుతూ పురోహితుడు చెప్పింది చేస్తున్నాడు. తన చుట్టూ వున్న అమ్మాయిల్తోపాటు సామ్రాజ్యం మెడ సారించి పెళ్ళికొడుకుని కుతూహలంగా చూస్తోంది.

'ఎంతందం!' అనుకుంది. స్నేహితురాల్ని తలచుకొని, 'ఎంతదృష్టం దానిది!' అనుకుంది.

విజయని పీటలమీదికి తీసుకువచ్చి కూర్చోపెట్టారు. పచ్చని ఒళ్ళూ, పిరుదుల్ని దాటిన నల్లని తాచులాంటి జడా, విశాలమైన కనుదోయి, సన్నని నాసికా, చిన్నమూతి... అపురూపమైన అందం విజయది. పెళ్ళికూతురి అలంకరణతో విజయ అందానికి మరికొంచెం మెరుగు వచ్చింది.

పూలతో కుట్టిన జడభారం కొంతా, నవవధువు సిగ్గు ఇంకొంతా అవగా చూపుల్ని భూమిలోకి గుచ్చేసి కూచుంది విజయ. అక్కడున్న అనేకులతోబాటు సామ్రాజ్యం 'చక్కని జంట' అనుకుంది. 'అందం చక్కటిది గనకనే దానికింత లక్షణమైన మొగుడు దొరికాడు!' మనసు ఈర్ష్యతో కుతకుత వుడికింది. నిట్టూర్పు దీర్ఘంగా వెలువడింది. ఒళ్ళంతా చికాగ్గా అయింది. పెళ్ళికొడుకు విజయమెళ్ళో మాంగల్యం కట్టాడు. తరవాత పోటీలు పడి ఒకట్టిద్దరూ తలంబ్రాలు పోసుకున్నారు. పందిట్లో కొందరు వెళ్ళిపోతున్నారు. సామ్రాజ్యం విజయ తల్లిదగ్గరికి వెళ్ళి, వెళ్ళిపోతున్నట్టు చెప్పి ఆవిడెంత బతిమాలి వుండమన్నా వుండక వచ్చేసింది.

'ఇంత రాత్రివేళ వచ్చేశావేం? తెల్లారే వరకు తంతు బోలెడు వుందికద. వుండక పోయావా?' అంది మాణిక్యం.

తల్లికేం జవాబు చెప్పక బట్టలు మార్చుకుని పక్కమీద ఒరిగింది సామ్రాజ్యం. నిద్ర పట్టలేదు. కళ్ళు మూసుకుంటే విజయ పెళ్ళి హడావిడే దర్శనమిస్తోంది! మహారణ్యంలా వున్న మనసులో ఏ మూలనో కార్చిచ్చు రగుల్కొంది. 'సెగలు, పొగలు చెలరేగి అది తననే దహించి వేయదుగద!' భయపడింది సామ్రాజ్యం. ఆలోచనల్ని బలవంతాన్నెటు మళ్ళించినా పరితాపమే మిగిలేది.

'ఇంక చదవనంటున్నావు కద.....

ఏం చేస్తావే, సామ్రాజ్యం!'

పి. యు. సి. అయినాక స్నేహితు రాళ్ళంతా ఒకరింట్లో సమావేశమయి ఆ తరవాత ఎవరెవరేం చేస్తారో ఆవేళ ముచ్చటించుకొంటున్నారు నళిని, సావిత్రి, కమల బియ్యేస్సీ చదువుతారట. ఉష ఉద్యోగం చేస్తుందట. పద్మకుమారి పెళ్ళైపోయింది. మరో ఇద్దరు బియ్యే చదివితే చదువుతాం. లేకపోతే లేదని నాన్నారు వాళ్ళకి మేరికాలు కుదిరే న్యాయట! విజయా చదువనంది. పెళ్ళిచేస్తున్నార్ట వాళ్ళ వాళ్ళు! సామ్రాజ్యం పి. యు. పి. పాసవటమే గగనమయింది. చదువులో శ్రద్ధా, వోపికాకూడ అంతగా లేవు ఆమెకి.

'ఏమే వులకవు పలకవు, తరవాతేం జేస్తావంటే?' ఉష గద్దించింది.

'ఏం చేస్తుందే దొరికితే వుద్యోగం లేక పోతే పెళ్ళి' అని కన్నుకొట్టింది కమల,

'ఆ...అ ముచ్చట ఒక్కటే తక్కువయిందీ కోతిముఖానికి' సామ్రాజ్యం నణిగింది.

'ఏ ముచ్చటే? వుద్యోగమా? పెళ్ళా?' ముగ్గురు ఒకే గొంతుతో అడిగారు.

తక్కినవాళ్ళు పైటకొనలు వుండలు చుట్టి నోళ్ళలో కుక్కేసుకున్నారు. కాస్సేపు నవ్వులు...సామ్రాజ్యం కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. హాణికేపెదాలో ఎర్రబడ్డ ముఖంతో గభాల్న లేచి వచ్చేసిందక్కడ్నుంచి. 'ఎంత పొగరు! ఎంత గర్వం! వీళ్ళే చక్కనైన వాళ్ళని! విన్నాళ్ళు వుండిపోతుందీ చక్కదనం! వయసు పైబడేదాకనే కదా... ఈలోవున ఏరోగమో, రొస్టొ వస్తే? ఏ ప్రమాదమో జరిగితే?...

సామ్రాజ్యం మనసు ఈర్ష్యతో, ద్వేషంతో, రోషంతో గంటు గంటు పడి సౌమ్యతనీ, సంస్కారాన్నీ కోల్పోయింది. మెత్తని, నున్నని రహదారిలో ముళ్ళమొక్కలు మొలిచాయి.

'అమ్మాయ్, ఆ కళ్ళేమిటే ఎర్రగా, ఉబ్బి న్నాయి?' మాణిక్యం కూతురి వాలకం చూచి కళవెళ పడింది.

'ఏంలేదు, చీమకుట్టింది' ముఖంతిప్పి బ్రాత్రూంలోకి పారిపోయిన కూతుర్ని చూచి ఆవిడ నిట్టూర్చింది.

అన్నం వడ్డిస్తూ "శేషాద్రి తెలుసా కదమ్మా, పై వారం" అని అడిగిన తల్లిసుండి ఇంపుల్ని కంచంలోకి తిప్పింది సామ్రాజ్యం. తననింకా చదివించాలని తల్లి తాపత్రయం!

'నేను చదువనమ్మా' చెప్పేసింది.

కళ్ళు విప్పార్చి చూసింది మాణిక్యం కూతుర్ని. ఆవిడ మనసు బరువెక్కింది. 'అది ఇంక చదవదు. దానికి పెళ్ళి మీదకి మనసుపోయింది. ఈబాధ్యత తన మీద పెట్టి ఆ మహారాజు పోయారు భర్త జ్ఞాపకం వచ్చి, మూసిన కళ్ళవెనుక జ్ఞాపకాలనీడలు కదిలేయి. సామ్రాజ్యం ఎస్సెల్సీ చదూతున్న రోజుల్లో, రోడ్డుమీద బస్సు ప్రమాదం జరిగి, హాస్పటల్లో చేర్చేరు అతన్ని. స్పృహ వచ్చేక ఇరవయి నాలుగ్గంటలకంటె ఎక్కువ సేపు బతకలేదు. చనిపోయేముందు—

'అమ్మాయి ఎస్సెల్సీ పాసయ్యాక, ఇంకా చదివిస్తానంటే చదివించు. నేను పనిచేసిన కంపెనీవారు ప్రావిడెంటుఫండు ఇస్తారు. పెళ్ళికైనా, చదువుకైనా ఆడబ్బు అవసరవౌతుంది.'

ఈరెండుమాటలూ చెప్పి అతను కన్ను మూశారు.

ప్రావిడెంటుఫండువచ్చింది. సామ్రాజ్యం పి.యు సి. వరకు చదువయిందనిపించింది. 'ఇంక పెళ్ళి ప్రయత్నాలారంభించాలి' అనుకుంది మాణిక్యం. అన్నగార్ని ఉత్తరం రాసి రప్పించింది. శేషాద్రి చెల్లెలు చెప్పిన కబురువిని ఇబ్బందిగా ముఖం పెట్టాడు.

'నాలుగైదువేలు ఇస్తే మటుకు... దీనికి సంబంధం కుదరటం కష్టమే నే' అన్నాడు.

పక్కగదిలోంచి చెవులు రిక్కించుకు వింటున్న సామ్రాజ్యం హతాశురాలయింది. తల్లి అంటోంది: 'అంతకంటె ఎక్కువ డబ్బు ఇచ్చుకోగలమా...ప్రావిడెంటుఫండు వచ్చిందే చాల తక్కువ కద, ఒక్క కట్నంతో సరిపోతుందా. పెళ్ళికెంత ఖర్చుంటుందో!'

శేషాద్రి చికాకుపడ్డాడు. 'నేవన్నదది కాదమ్మా. నువ్వు పదివేలిస్తే మటుకు, మనమ్మాయిని వాళ్ళిష్టపడతారామా స్తే, అని?'

మాణిక్యం ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేకుండా పోయింది. అన్న గారన్నమాటల్లో అసత్యం ఏంలేదు. అందులోని కటికసత్యం ఆవిడని కంపింపజేస్తోంది. తన పుట్టింటగాని, అత్తింటగాని ఎవరితోనైనా సామ్రాజ్యాన్ని కలుపుదామనుకుంటే ఆ వీలూ లేదు! అందరూ 'నన్ను ముట్టుకోకు. నామాలకాకి!' అన్న రకమే! అన్నగారు శేషాద్రి మరవత్వం అతనికంతా ఆడసంతానమే అవటంవల్ల బయటపడలేదు. తమ్ముడు గోవిందుడు ఒకసారి మాటల్లో, సామ్రాజ్యాన్ని తన కొడుక్కి చేసుకొమ్మని అంటే— అంతవరకు వచ్చి, వెళ్ళినాడల్లా రాకపోకలు బందుచేసేశాడు. ఇలా వుంటుంది బంధువుల బంధుత్వం! ప్చ్!

'మనమే అలా అనుకుంటే ఎలాగ, అన్నాయ్! ప్రయత్నాలు చేసి ఎలాగయినా దాన్నో ఇంటిదాన్ని చెయ్యాలి...'

చెల్లెలు అభ్యర్థిస్తే శేషాద్రి రెండు మూడు సంబంధాలు తీసుకువచ్చాడు

తల్లి 'రేపు పెళ్ళివారు వస్తారమ్మా' అని సంబరంగా చెప్పగానే, సామ్రాజ్యం ఆ రాత్రంతా కలల అలల్లో తేలిపోతుంది. లక్ష సందేహాలతో, భయాలతో వుక్కిరిబిక్కిరవుతుంది. 'రేపు!... రేపే వస్తారట, వాళ్ళు! ఎందరు వస్తారు? ఎందరొస్తే తనకెందుకు? అతను ... పెళ్ళికొడుకు...ముఖ్యంగా... ఎలా వుంటాడు? పొడగ్గా, దృఢంగా, ఎర్రగా, కథల్లో వర్ణించేలాగా, సినిమా హీరోలాగా వుంటాడా? సన్నగా, నాజూగ్గా వుంటాడా? మీసకట్టు అందంగా వుంటుందా? రౌడీలా వుంటుందేమో, వేషం!... బుద్ధులు రౌడీవి అవకుండా వుంటే చాలు!...ఇదేమిటి అనిలా ఆలోచిస్తోంది! పెళ్ళికొడుకు ఎలా ఉన్నా తనని అంగీకరిస్తాడనేముంది? మగవాళ్ళు ఎలావున్నా పర్వాలేదు. కాబోయే పెళ్ళాలు చక్కగా వుండాలి! మగాడికో న్యాయం! ఆడదానికో న్యాయం! ప్చ్ ఆడదయి పుట్టటమే కొంత దురదృష్టం. అందులో అనాకారితనం ఇంకా దౌర్భాగ్యం! అవాళ మామయ్య ఎలా అనేశాడో! మావయ్యకే అంత లేలికభావం వుంటే తనకేమీ కాని పరాయి మగాడికి తనంటే సద్భావం ఎక్కడినించి, ఎలా వస్తుంది? ప్చ్!

# పెళ్లి

ఒకపూటంతా కూచుని, అలంకరణ సాగిస్తుంది సామ్రాజ్యం. తల్లి తవో వెయ్యి వేసేది, ముస్తాబులో. 'నీకు తెలీదమ్మా, రాజ్యం...ఆడదాని అందమంతా చీరెకట్టులోనే వుంటుంది. నామాట విని ఈ చీరమీదికి ఆ జాకెట్టు వేసుకో. ఆ కుచ్చెళ్లు సరిగ్గా రానియ్యి. పైట ఇలా వుండాలి...వూ... చూశావా. ఎంత బాగా నప్పిందో నీకీ కట్టు ?'

నా విషయంలో అలంకరణకి విలువ లేదమ్మా ... మేలిమి బంగారానికే మెరుగులు చెల్లుతాయి. ఈ ముఖం... దీనికేది దిట్టుబెట్టి తీరుగా కప్పింప చేయగలవు? ఈ మెల్లకళ్లనీ, ఎత్తుపళ్లనీ, తారు వలుపునీ ఎట్లా దాచగలవు ?'

'నీ ముఖం! వూరుకో! ఆ పౌడరు కురి కాస్త రాసుకో. ఆ బొట్టు తిన్నగా దిద్దుకో. చూడూ...జుత్తు చెవులమీంచి కొంచెం కప్పుకో. బావుంటుంది.'

తల్లి సలహాలకి, తననేర్పు కొంత జత చేర్చి ఆకర్షణీయంగా కనిపించటానికి పాటుపడే సామ్రాజ్యం ... అద్దం దగ్గర పెట్టుకు చూచి గభాల్న మంచంమీదికి దాన్ని గిరవాటేసేది. తన్నాటి వాళ్లకి అద్దం శత్రువు!

వచ్చినవాళ్లు 'పెళ్లి వుత్తరం రాస్తా'మని చెప్పి ఆ తరవాత, 'మీ అమ్మాయి మాకు నచ్చలేదని' ఒకరూ, 'మా అబ్బాయి పిల్లనిష్టపడలేద'ని ఒకరూ ఇలా తప్పుకునేవాళ్లు. మాణిక్యం ఇంటి అలంకరణకీ, కూతురి ఒంటి అలంకరణకి పడిన శ్రమా, పెళ్లి చూపులకయిన ఖర్చూ అంతా వృధా అని తెలిశాక ఆవిడకి శోషవచ్చినట్టయిపోయేది.

* * *

తలుపు తట్టినచప్పుడు విని మాణిక్యం గడియారంవేపు చూసింది. ఎనిమిదింపావు! కనుబొమలు ముడిచి, తలుపు తీసింది.

'ఇంతసేపు మీ స్నేహితురాలు వుంచేసిందేమే?'

'ఇవాళ సావిత్రి పుట్టినదినమమ్మా. చాలా బాగా జరిగింది. సావిత్రి ఏదో చెబుతూ వుంచేసింది ఇంతసేపు.'

'వాళ్ల కబుర్లలో పెట్టేస్తే మట్టుకు మధ్య తెములుచుకు రావద్దూ తే?'

'వచ్చి ఇక్కడేం చెయ్యాలేం? ఒకరి మొహం ఒకరు చూసుకుంటూ కూచోటమేగా?'

'ఆడపిల్లవి. రాత్రివేళ తిరగడం అంత మంచిది కాదని చెబుతున్నామ.'

'నీకేం భయంవద్దులే. నీ ఆడపిల్లని ఎవళ్లూ ఎత్తుకుపోరు. ఇదెవరికీ అక్కర్లేదు, తాంబూలం, దక్షిణా పెట్టిచ్చినా...'

మాణిక్యం కూతుర్ని చూస్తూ ఇంకేం పలకలేకపోయింది. 'దాని మనసు బాగా గాయపడి వుంది. తను ఆ గాయాన్ని పెద్దది వెయ్యకూడదు. అది మానటానికి పలేపం మినహా తను వెయ్యగల మందు లేదు!' అనుకుంది

సామ్రాజ్యం చకితురాలవుతోంది, ఈ మధ్య తల్లి ముఖాన్ని ప్రసన్నత చూచి. తను షికారుకి వెళ్లి ఏడుగంటలకి వచ్చినా,

సినిమాకి వెళ్లి పదకొండుగంటలకి ఇల్లు చేరినా,

స్నేహితురాలింటినించి ఏవేళకి వెళ్లినా,

'ఎక్కడికి వెళ్లావు?' అనిగాని,

'ఇంతసేపు ఎక్కడున్నావు?' అని గాని, తల్లి అడగదు!

'ఆడపిల్లవి. పెళ్లికావల్సిన దానివి. ఇలా సమయమూ, సందర్భమూ పాటించకుండా తిరుగుతావా!' అని మందలించదు!

'ఇంత బరితెగించిన దానివయ్యావేమే!' అని కేకలు వెయ్యదు!

ఏమిటీ మార్పు! తన చర్యల్ని సమర్థిస్తున్నట్టా? లేక— ఇది—రుతుపానుకు ముందటి ప్రశాంతతా? ఏమో! ఏమైనా తనకింక బెంగలేదు. ఎండి, మోడయి, చిరు చినుకుకి సైతం తపించే ఈ చెట్టు మీద వస్నీటివాన కురియబోతోంది!

ఈ ఎడారిలో పచ్చదనం నెలకొంటుంది!

ఈ బీడు సారవంత మౌతుంది!

అవునిది నిజం! ఇది కలకాదు. ఇది కల్లకాదు, సామ్రాజ్యం తలగడలో ముఖం దాచుకుంది.

* * *

గబగబ వచ్చి, మంచంమీద కూచుని తులసీ రామాయణం చదువుకొంటున్న తల్లిని రెండుచేతుల్తోనూ చుట్టేసి, ఆవిడ ముందొక చిన్న ఫొటోని చూపించింది చేత్తోఎత్తి, సామ్రాజ్యం. 'ఇదిచూశావా, అమ్మా ?'

మాణిక్యం కళ్లద్దాలు సవరించుకుని ఆ ఫోటోని తదేకంగా చూసింది. ఎవరో అబ్బాయి! ముప్పయ్యే వుంటాయేమో! వళ్లు వున్నా బాగానే వున్నాడు! లోపల్నించి వచ్చే ఆదురుపాటు నణచుకొంటూ,

'ఎవరే, రాజ్యం, ఈ అబ్బాయి ?' అడిగింది.

'నేను వెళుతూంటాను కదమ్మా సావిత్రి ఇంటికి. సావిత్రి అన్నగారు ఇతను. బ్యాంకిలో పనిచేస్తున్నారు. తల్లీ తండ్రీ లేరు. ఒక చెల్లెలూ, తమ్ముడూ, ముగ్గురూ చాలా మంచివాళ్లు.'

కూతుర్ని ఒకసారి నిలువునా పరికించి 'చెబుతున్నది, పూర్తికానియ్యి' అన్నట్టు చూచింది మాణిక్యం.

'అతనికి రెండేళ్లకితం భార్య ప్రసవ



మీ అత్తగారికివ్వండి
A-1 డస్ట్ టీ
మీ తెలివి తేటలకు
ఆమె మెచ్చుకొనును
రుచి భరితము, సువాసన పూరితము
A-1 డస్ట్ టీ డబ్బు మిగుల్చును!

బ్రూక్ బాండ్ A-1 డస్ట్
ప్యాకెట్టుకు హెచ్చు కప్పుల మంచి టీ




BB 6097

**గమనిక**

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ క్రింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥







# పెళ్లి

మయ్యా! తల్లీ, పిల్లా ఇద్దరూ మరణించారుట. అప్పటినించి ఇంట్లో చెల్లెలు తమ్ముడూ పోరుపెడుతూంటే గుణవంతురాలయిన ఆ అమ్మాయి కోసం చూస్తున్నార్ట. 'మా అన్నయ్యకి అందం అక్కర్లేదు. స్వభావం మంచిదైతే చాలు.' అంది సావిత్రి రేపొద్దున వచ్చే అమ్మాయి చదువుకొంటున్న చెల్లెళ్ళి, తమ్ముణ్ణి సరిగ్గా ఆదరించదని భయంట!'

మాణిక్యం వూపిరి గట్టిగా పీల్చుకున్నది. ఒక ఆర్ద్రత, బాధ, ఇదమిత్థమని చెప్పలేని కొన్నిభావాలు కలగలుపు ఆవిడ గుండెల్లో సుళ్ళు తిరిగాయి. కూతుర్ని అమాంతం గుండెల కదుముకున్నది.

'అర్థమయిందే, రాజ్యం నీ ఆరాటం అర్థమయింది. కూతురి సాధక బాధకాలు గ్రహించలేని తల్లి వుండదే, అమ్మాయ్, లోకంలో కాని...కాని, అమ్మాయ్...ఈ దుర్భర పరిస్థితి మాత్రం తల్లికి రాకూడదు. 'నాకు పెళ్లిచెయ్యి' అని కూతురిచేత ఏ తల్లీ చెప్పించుకోకూడదు ఇది ... ఇది నిజంగా నా దౌర్భాగ్యమేను...' అని గొణుక్కున్నది మనసులో.

'మనం వారింటికి వెళదాం' అంది.

'అమ్మా...మరి, మరి ఈ విషయం కూడా నువ్వు వినాలి'

'చెప్పమ్మాయ్'

'వాళ్లది అగ్రవర్ణం కాదు.'

'సా...మ్రా...జ్యం!'

'నువ్వు అంగీకరిస్తే...అతనే మనింటికి వచ్చి...'

మాణిక్యం కళ్ళముందు పల్చటి తెరలు జారుతున్నవి.

'అమ్మా!'

'నన్ను కొంచెంసేపు ఒంటరిగా వదిలెయ్యి, తల్లీ...'

'అమ్మా నాకు తెలుసమ్మా, నీ పరిస్థితి. ఇది తట్టుకోడం చాలా కష్టం. నీకు సంప్రదాయం...రక్తంలో జీర్ణించుకుపోయిన పురాతనతత్వం రాజీపడదీ పరిస్థితితో. పైగా సంఘంవలని భయం. నాకన్నీ తెలుసమ్మా...కాని నేను మనిషిని, చీమూ, నెత్తురూ, కోరికలూ, బలహీనతలతో నిండిన మనిషిని. అందరాడపిల్లలకి మల్లే నేనూ పెళ్లిచేసుకోవాలని నా జీవితంలోనూ వసంతం వెల్లి విరియాలనీ వాంఛించటం నాది 'తప్పా, చెప్పమ్మా? నాకోరిక అసమంజసమైనదా? నా తలంపు అవివేకమైనదా? ఇంతకంటె ఉత్తమ అవకాశం నా బ్రతుకులో నాకింక రాదు. మోహనరావుగారి కంటె ఉత్తమ పురుషుడు నాకు లభ్యమవడు.'

'కాని, రాజ్యం, నా వాళ్లు ఎవ్వరూ నన్ను మళ్లీ మొహం చూడరు.'

'ఇంటికి రానేరారు సరిగదా, ఎక్కడైనా కనిపించినా నిరసనగా చూస్తారు. నా కూతురికి పెళ్లి చేశానని, నా గురించి వినలేని విమర్శలు పుట్టిస్తారు. ఈ అనుభవాలకా, నేను ఆయన పోయినా, ఇంకా బతికి వున్నది?!'

సామ్రాజ్యం బావురుమంది. మాణిక్యం చెంగుతో కూతురికళ్ళు తుడిచింది.

* * *

ఆ వీధిలో ఆ పచ్చ డాబాముందు పచ్చని పందిరి వేశారు కొత్తగావేసిన సున్నంతో ఆ ఇంటిగోడలు కళ కళ లాడుతున్నాయి. గుమ్మాలు పసుపు, కుంకుమలతో అలంకరించ బడినాయి. ద్వారాలకి మామిడాకుల తోరణాలు కట్టారు పందిరంతా చిన్న చిన్న బల్బులు అమర్చారు. రంగు కాగితాలు కత్తిరించి జెండాలా అమర్చారు. భజంత్రీలు పొద్దున్నించీ మ్రోగుతున్నాయి.

వీధి గుమ్మంలో నుంచుని మాణిక్యం ఎదురింటివేపు చూస్తోంది. రెండ్రోజుల క్రిందట ఆ ఇంటావిడ వచ్చి, శుభలేఖ ఇచ్చి వెళ్ళింది.

ఈ వేడుక తనకు లేదు. ఈ ముచ్చట తనకి రాదు.

నిన్ననే మోహనరావు చెల్లెలూ, తమ్ముడూ వచ్చి తమతో సింహాచలం రావల్సిందిగా కోరారు. తనకంత సాహసం లేదు. సింహాచలంలో ఈ రోజు సామ్రాజ్యం పెళ్లి చేసుకుంటోంది! ... భజంత్రీలు పెద్దపెట్టున వాయిస్తున్నారు ... మాంగల్యధారణ కాబోలు!!

మాణిక్యం చెమర్చిన కన్నులు చెంగుతో ఒత్తుకుంది. ●







# అభిమానమా? అవివేకమా?




మహేష్

చిదంబరం, చూడామణి ముందుగా వచ్చారు. తరువాత కొంచెం సేప టికి చంద్రశేఖరం వచ్చాను.

'రావడం యెందుకు ఆలస్యం అయింది?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'కనకవల్లి నటించిన సినిమా మీద పోటీగా అమృతవల్లి నటించిన సినిమా విడుదల అయిందట. అందువేత కనకవల్లి అభిమాన సంఘసభ్యులు, అమృతవల్లి అభిమాన సంఘసభ్యులు కొట్టుకొన్నారు. అక్కడే కొంచెంసేపు నిలబడ్డాను.'

'ఎవరో నటించిన సినిమా మీద పోటీగా యింకొకరు నటించిన సినిమా విడుదల అయినందువలన, కొంతమంది ప్రజలు కొట్టుకొన్నారు, అనగానే కోర్టుకు సంబంధించిన సంఘటన ఒకటి నాకు గుర్తుకు వచ్చింది.'

'ఏమిటి ఆ సంఘటన ?'

'ఒక పల్లెటూరినుండి వెంకయ్య అనే ఆసామీ మొట్టమొదటి సారిగా కోర్టుకు వెళ్ళాడు. ఆ కోర్టులో యిద్దరు న్యాయవాదులు చాలా తీవ్రంగా వాదిస్తున్నారు. వెంకయ్య ఆ న్యాయవాదులనుచూసి తనలో ఇలాగ అనుకొన్నాడు, వీళ్ళు యిద్దరూ కోర్టులోనే యింత తీవ్రంగా వాదించుకొంటున్నారుకదా! ఇంతలకు వచ్చిన తరువాత తప్పకుండా ఒకరినొకరు కొట్టుకొంటారు.

వెంకయ్య యెక్కడకు వెళ్ళకుండా ఆ న్యాయవాదులను చూస్తూ అలాగే ఉండిపోయాడు. కోర్టులో వాదన పూర్తి కాగనే ఆ న్యాయవాదులు యిద్దరూ ఒకరి భుజంమీద ఒకరు చేతులు వేసి కొని కబుర్లు చెప్పుకొంటూ కాఫీ హోటలు వైపుకు వెళ్ళిపోయారు.

అయితే యింత సేపూ వాళ్ళు యిద్దరూ యింత తీవ్రంగా వాదించినది కేవలం నటనే అన్నమాట అని అను కొని వెంకయ్య ఆశ్చర్యపోయాడు' అని అంటూ చూడామణి యింకా చెప్పడం ప్రారంభించాడు.

'కోర్టులో న్యాయవాదులు తమ ఫీజు కోసం, వాదిస్తున్నారు అది వారి వృత్తి. అలాగే సినిమానటులు తమ ప్రయోజనాల కోసం తమలో తాము పోటీ పడుతున్నట్లుగా ప్రజలకు కన్పిస్తున్నారు. అది వారికి అవసరం.

సినిమా నటీ నటులు పోటీ పడుతున్నారు. అనగానే ప్రజల్లో కొంత మంది ఒకర్ని, బలపరుస్తారు. ఇంకొకర్ని యింకొంతమంది బలపరుస్తారు. అప్పుడు ప్రజల్లో ఈ నటీనటులమీద ఆసక్తి పెరుగుతుంది. ఈ నటీ నటుల

జయాపజయాల్ని కేవలం తమవిగానే అప్పుడు ఆయా ప్రజలు భావిస్తారు అందు చేత తమ అభిమాన నటీ నటుడు ఉన్న సినిమా విజయవంతం కావడానికి ఈ ప్రజలు ప్రయత్నిస్తారు, అదే ఈ నటీ నటులకు ప్రయోజనం.

నటీనటుల మధ్యను పోటీ లేకపోయి నట్లయితే ప్రజలకు సినిమాలమీద అంతగా ఆసక్తి ఉండదు. అందుచేత ఈ నటీ నటులు తమలో తాము పోటీ పడు తున్నట్లుగా ప్రవర్తిస్తున్నారు. ప్రజ లకు ఈ వివేకం లేకపోవడం వలన అభి మాన సంఘాల చర్యలు మితిమీరి పోతు న్నాయి.'

'అవును. ఇటువంటి ప్రజల అవి వేకాన్నే ఇదివరకు యిద్దరు హరిదాసులు తమ స్వార్థానికి వినియోగించుకొన్నారు కదా!' అన్నాడు చిదంబరం.

'ఆ హరిదాసుల కథ యేమిటి?' అని కూడామణి ప్రశ్నించగా చిదంబరం చెప్పడం ప్రారంభించాడు.

'చవటాపురంలో ఎగువవీధి, దిగువ వీధి అని రెండు వీధులు ఉన్నాయి. ఒక సంవత్సరం ఆషాఢ మాసంలో మొదటి రోజునే వీరభద్రయ్య భాగవతార్ అనే హరి దాసు దిగువవీధికి వచ్చాడు,

తనచేత ఒక హరికథ చెప్పించ వలసి

# ముగ్గురు మూర్ఖులు

నదిగా వీరభద్రయ్య భాగవతార్ దిగువవీధి ప్రముఖులను కోరాడు. అప్పుడు వారు చందాలు వేసికొని వీరభద్రయ్య భాగవ తార్‌కు నూటపదహారు రూపాయలు యిచ్చారు. ఆ రాత్రి వీరభద్రయ్య భాగవ తార్ దిగువవీధిలో 'నలదమయంతి' హరి కథ చెప్పాడు. ఆ సందర్భంలో హరిదాసు దిగువవీధి ప్రముఖుల కళాపోషణను గురించి పొగిడాడు.

మర్నాటి ఉదయం రామభద్రయ్య భాగవతార్ అనే హరిదాసు ఎగువ వీధికి వచ్చాడు. తనచేత ఒక హరికథ చెప్పించ వలసినదిగా అతను ఎగువవీధి ప్రముఖు లను కోరాడు. అంతకుముందు రాత్రి దిగువవీధిలో హరికథ జరిగింది కాబట్టి, వెంటనే ఎగువవీధిలో కూడా హరికథ చెప్పించవలసి అవసరం యేర్పడింది. అందుచేత ఎగువవీధి ప్రముఖులు రామ భద్రయ్య భాగవతార్‌కు నూటపదహారు రూపాయలు యిచ్చారు.

ఆరాత్రి రామభద్రయ్య భాగవతార్ ఎగువవీధిలో 'సత్యహరిశ్చంద్ర' హరికథ చెప్పాడు. ఆ సందర్భంలో అతను ఎగువ వీధి ప్రముఖుల కళాపోషణకు పొగిడాడు.




అంతేకాకుండా హరిశ్చంద్రుని పాండి త్యంలో నలుడు ఎంత? అంటూ రామ భద్రయ్య భాగవతార్ అంతకుముందు రాత్రి వీరభద్రయ్య భాగవతార్ చెప్పిన కథను విమర్శించాడు.

దానితో దిగువవీధి ప్రముఖులకు కోపం వచ్చింది. 'ఏమైనాసరే మీరు ఎగువ వీధి వారికి తగిన సమాధానం చెప్పాలి.' అని వారు వీరభద్రయ్య భాగవతార్‌ను ప్రోత్సహించారు అతను 'సరే' అని నూటపదహారు రూపాయలు తీసికొని ఆ రాత్రికి దిగువవీధిలో 'సతీసావిత్రి' హరి కథ చెప్పాడు.

సావిత్రితో పోల్చినట్లయితే హరిశ్చంద్రుడనగా యెంత? అసలు రామ భద్రయ్య భాగవతార్‌కు పురాణాలను గురించి యేమి తెలుసును? అని వీర భద్రయ్య భాగవతార్ రామభద్రయ్య భాగ వతార్‌ను విమర్శించాడు.

నాల్గవనాడు ఎగువవీధి ప్రముఖులు రామభద్రయ్య భాగవతార్‌కు మళ్ళీ నూట పదహార్లు యిచ్చి హరికథ చెప్పించారు. ఆరాత్రి రామభద్రయ్య భాగవతార్ భక్త ప్రహ్లాద హరికథ చెప్పాడు. 'అసలు వీర భద్రయ్య భాగవతార్ యెంతవరకు చదువు కొన్నాడు? అని నేను ప్రశ్నిస్తున్నాను' అని ఆ సందర్భంలో రామభద్రయ్య భాగవతార్ ప్రశ్నించాడు.

అయిదవనాడు వీరభద్రయ్య భాగవ తార్ దిగువవీధి వారివద్ద మళ్ళీ నూట పదహార్లు పుచ్చుకొని హరికథ చెప్పాడు. 'రామభద్రయ్య భాగవతార్‌కు అసలు అక్షరజ్ఞానం ఉందా?' అని అంటూ వీర భద్రయ్య భాగవతార్ తీవ్రంగా విమర్శిం చాడు.

ఆరవనాడు రామభద్రయ్య భాగవతార్ ఎగువవీధి ప్రముఖులవద్ద నూటపదహార్లు పుచ్చుకొని, వీరభద్రయ్య భాగవతార్‌ను యేకి పారేశాడు.

ఈ విధంగా నెల్లాళ్ళు గడిచాయి. వీరభద్రయ్య భాగవతార్ పదిహేను హరి కథలు చెప్పాడు. అతనికి పదిహేను నూట పదహార్లు వచ్చాయి. రామభద్రయ్య భాగవతార్‌కు కూడా పదిహేను నూట పదహార్లు ముట్టాయి.

ఒకవాడు వారుయిద్దరూ కూడా యెన

రికి చెప్పకుండా వెళ్ళిపోయారు. తరువాత పదిరోజులకు చవటాపురంలోని ప్రముఖులకు శుభలేఖలు వచ్చాయి. వీరభద్రయ్య భాగవతార్ కుమారునికి, రామభద్రయ్య భాగవతార్ కుమార్తెను యిచ్చి వివాహము జరుపుతున్నట్లుగా ఆ శుభలేఖల్లో ఉంది.

ఆ సందర్భంలో ఆ హరిదాసులు యిద్దరూ కలిసి చవటాపురం ప్రముఖులకు ఒక ఉత్తరం కూడా రాశారు. ఆ ఉత్తరంలోని విశేషాలు యివి.

'మా పిల్లలకు ఈ శ్రావణ మాసంలో పెళ్ళి చేద్దామని అనుకొన్నాము. కాని మావద్ద డబ్బులేదు. ఆషాడమాసంలో సాధారణంగా హరికథలు యెక్కువగా ఉండవు. అందుచేత మాకు డబ్బువచ్చే అవకాశం కూడ లేదు. కాబట్టి మేము యిద్దరమూ కూడబలుక్కొని మీవూరు వచ్చాము. ఒకరినొకరం మేము విమర్శించుకొనడంవలన మామీద మీకు ఆసక్తి కలిగింది. అందుచేత మీరు డబ్బుయిచ్చి మాచేత నెల్లాళ్ళపాటు హరికథలు చెప్పించారు ఆ డబ్బుతోనే మాపిల్లల పెళ్ళి చేస్తున్నాము. మీరందరూ పెళ్ళికి వచ్చి మమ్మల్ని ఆనందింపజేయ గోరుతున్నాము' అని చిదంబరం హరిదాసుల కథను చెప్పాడు.

'అక్కడ హరిదాసులు యెక్కువ డబ్బు సంపాదించుకొనే నిమిత్తం ఒకరినొకరు విమర్శించుకొన్నారు. చవటాపురంలోని ప్రజలు అవివేకులు కాబట్టి హరిదాసులు వేసిన వలలో పడ్డారు.

ఇక్కడ సినిమా నటీనటులు తాము యెక్కువ డబ్బు సంపాదించుకొనే నిమిత్తం పోటీపడినట్లుగా ప్రవర్తిస్తారు. ఆ 'పోటీ' నిజమేనని నమ్మి ప్రజలు అనవసరంగా కొట్టుకొంటున్నారు.

సామాన్య ప్రజల్ని రోజూ యెదుర్కొంటున్న సమస్యలు యెన్నో ఉన్నాయి. అందుచేత అభిమాన సంఘాల కార్యక్రమాల్లో ప్రజలు వ్యర్థం చేసికొంటున్న కాలాన్ని సద్వినియోగం చేయడానికి యెన్నో అవకాశాలు ఉన్నాయి. ఉదాహరణకు — పట్టణంలోని మురికివాడలను ప్రభుత్వంతో నిమిత్తం లేకుండా ప్రజలే శుభ్రం చేయవచ్చును. లేదా సరకులను దాచివేసి ధరలను పెంచుతున్న వర్తకుల కొట్లవద్ద శాంతియుతంగా పికెటింగు చేయవచ్చును.

ఇటువంటి ప్రజోపయోగకరమైన పనులను మానివేసి సినిమా నటీనటుల పేరు మీద కొంత మంది ప్రజలు కొట్టుకొంటున్నారు' అంటే దానికి కారణం అభిమానమా? అవివేకమా? ఆలోచించండి' అన్నాడు చూడామణి.

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ చంచలాక్షు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

# 'సన్మానాలు మహానుభావులకి మాత్రమే...'



—శోభన్ బాబు



ప్ర: నటుడిగా మీ ఆశయం, అభిలాష ఏమిటి?

జ: నాలుగు కోట్ల ఆంధ్ర సోదర సోదరీ మణులలో కనీసం ఒక్కకోటిమంది హృదయాలలోనైనా నటుడిగా సాను భూతిని సంపాదించుకోవడమే నా ఆశయం!

**తెలిసింది కొంతవరకే**

ప్ర: నటుడికి గర్వం అవసరమా? కాదా!

జ: గర్వం నటుడికే కాదు. ఎవరి కైనా అపకారిగానే పరిణమిస్తుంది! గర్వంవున్న ప్రతివ్యక్తీ ఎక్కువ వ్యధలతో నిష్ప్రయోజనమైన అనుమానాలతో జీవితాన్ని దుర్భరం చేసుకుంటాడు. 'ఎవరు ఎందుకు నవ్వినా తనను చూచేనేమోననే అనుమానంతో సతమత మౌతుంటాడు. ముఖ్యంగా నటుడికి గర్వం అసలు వుండకూడదు. నటనలో పరిపూర్ణత్వంకాని, పండిపోవడంగాని ఎవరికీ సాధ్యంకాదని నా నమ్మకం. ఎంత మహానటుడైనా ప్రతీ పాత్రనూ మెప్పించి రాణించలేడు. కొన్ని పాత్రలలోనే అతని నటన రాణిస్తుంది. అందువలన సర్వం పండిపోయాం అని గర్వపడి బోల్తాపడేకంటే, తెలిసింది తక్కువ, తెలుసుకోవలసింది ఎక్కువ అనుకుంటూ అధిగమించడం శ్రేయస్కరమని నా విశ్వాసం!

**దురాశ దుఃఖంచేటు**

ప్ర: మనిషికి ఆశ ఎంతవరకు వుండాలి?

జ: ఆశవుండాలి! కాని దానికి హద్దువుండాలి! 'దురాశ దుఃఖంచేటు' అని పెద్దలు వూరికే చెప్పారా? ఎక్కువ ఆశలు పెంచుకుంటూపోతే వున్నదానితో తృప్తి పడలేక వున్నదికూడ లేనిదై అసలు ఏమీ లేనివాడిగానే మిగిలిపోతాడు మానవుడు.

ప్ర: నేటి సినిమా పరిశ్రమపై మీ వ్యక్తిగత అభిప్రాయం చెప్పగలరా?

జ: 'సినిమా పరిశ్రమ' ఏ యితర పరిశ్రమకంటే ఏవిధంగానూ తీసిపోదు. చెదురుగా ఎదురయ్యే ఒకరిద్దరు చెడ్డ వాళ్లను దృష్టిలో పెట్టుకొని పరిశ్రమను గురించి పలువిధాలుగా భయపడవలసిన పనిలేదు.

**అభిమాన సంఘాలు**

ప్ర: నటుడికి అభిమాన సంఘాలవల్ల ప్రయోజన మేమిటి?

జ: నాకూ అభిమాన సంఘాలు వున్నాయి కాని...యింకా ఒక యిదమిద్ధమైన అభిప్రాయం కలుగలేదు. బహుశా వచ్చే సంవత్సరం ఒక నిశితమైన అభిప్రాయం చెప్పగలనేమో!

ప్ర: మీ గురించి మీ దగ్గరే పొగిడే వాళ్లపై మీ అభిప్రాయం?

జ: పొగిడేవాళ్లు ఎప్పుడూ మనదగ్గరే పొగుడ్తారు. ఆ వ్యక్తుల్ని నోరు తెరువగానే నోట్ చేసుకుంటాను. రెండవసారి ఎదురైతే తప్పించుకొని పారిపోతాను.

ప్ర: దాతృత్వం మనిషిని ఉన్నత స్థాయికి తీసికెళ్తుందంటారు. దీనిపై మీ వ్యాఖ్య?

జ: 'దాతృత్వం' మనిషిని మానసికంగా మాత్రమే ఉన్నతస్థాయికి తీసుకొని వెళ్తుందనుకుంటాను. మన తృప్తికోసం తోటిమానవులకు తోడ్పడ్డామనే ఆనందం ఒక్కటే మిగుల్తుంది చివరకు. ఎందుకంటె మా తాతగారు నాకు తెలిసి ఒక పాతికమంది బీదవాళ్లకు పెండ్లిండ్లు చేయించారు. ఇంకెంతో మందికి ఎన్నో విధాల సహాయపడ్డారు. కాని నాకళ్ల ముందే...ఇప్పుడు మరొకరు సహాయ పడవలసిన పరిస్థితి ఎదురైంది వారికి! అందుకే దాతృత్వం ... మానసికంగా మాత్రమే వున్నతస్థాయికి తీసుకొని వెళ్ల గలదు మనిషిని.

ప్ర: మీకు సన్మానాలపై మోజు వుందా?

జ: సన్మానం అనేదానిలోనే కొంత అతిశయోక్తి యిమిడివుంది. పైగా అది జరుగవలసింది ఎవరో మహానుభావులకు మాత్రమే. అంత ఆశ నాకులేదు.

**సామెతని అన్వయించు కోడంలోనే ఉంది**

ప్ర: దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి — ఈ సామెతపై మీ అభిప్రాయం?

జ: సామెత చాలా గొప్పదేకాని దానిని అన్వయించుకోవడంలో చాలా మెళుకువ అవసరం. ఎందుకంటే దీపం ఆరిపోతుందేమోనని భయపడి హడావిడి చేసుకున్నామంటే ఏమీ మిగుల్చుకోకముందే ఆదీపం ఆరిపోవచ్చు. ఉదాహరణకు మా విషయమే తీసుకోండి! పేరు వచ్చింది గదా అని పిక్చర్లు వత్తిడిగా వస్తాయి. పిక్చర్లు వస్తున్నాయికదా అని వచ్చిం

దల్లా ఒప్పుకుంటే...ప్రతిపక్ష్యరూ దెబ్బ తిని దానితోపాటు పేరూ పోయి చివరకు ఊరుకూడా వదిలిపెట్టి పోవలసిన పరిస్థితి రావచ్చు.

**పరిశ్రమలు స్థాపించే ఉద్దేశ్యం లేదు**

ప్ర : సినిమా పరిశ్రమలో ఒక ముఖ్యవ్యక్తిగావున్న మీరు ఆ సినిమాకు సంబంధించిన పరిశ్రమ లేమయినా ప్రారంభించే వుద్దేశ్యం వుందా?

జ : ఇప్పుడలాంటి వుద్దేశ్యం ఏమి లేదు. బహుశా ఏనాటికీ కలుగదేమో!

ప్ర : భగవదనుగ్రహం, విధి వ్రాతలపై మీకు నమ్మకముందా?

జ : విధి వ్రాతమీద నమ్మకం వుంది. నా 'తృప్తి'కూడా ఆ నమ్మకం పెట్టిన భిక్షే!

**అభిమాన నటుడు**

ప్ర : మీరు ఎక్కువగా అభిమానించే, హాలీవుడ్ నటుడెవరు?

జ : 'మేర్లన్‌బ్రాండో' నటనంటే చాలా యిష్టం!

అతని నటనలో అసహజత్వం మచ్చుకుకూడ కన్పించదు. ప్రకృతి విరుద్ధమైన పరిస్థితులలో నటిస్తూ ప్రకృతికి సన్నిహితంగా నటించడం ఎంతో కష్టం! ఆ మహానటుడు దానిని సాధించాడు. అందుకే ఆయనంటే ఎనలేని గౌరవం!

ప్ర : మీరు శరీరాన్ని ఆరోగ్యంగా వుంచుకోవడానికి అవలంబించే పద్ధతు లేమిటి?

జ : ఆహార నియమం, రాత్రిళ్ళు పని చేయకపోవడం, దురభ్యాసాలకు సాధ్యమైనంత దూరంగా వుండడం, నిత్య వ్యాయామం అన్నింటికీ మించి 'సంతృప్తి'

ప్ర : మీకు అభిమానులెలాంటి వుత్తరాలు వ్రాస్తూంటారు?

జ : అనేక రకాలుగా వుంటాయి. అయితే నా అభిమానులలో ఎక్కువభాగం ఇంజినీర్లూ, డాక్టర్లే కాబట్టి వెర్రి వ్యామోహం అంతగా కన్పించదు!

**ఇంటర్‌వ్యూ—శ్రీనివాస్**

# సినిమా

## పవిత్రజీవితం పూర్తయింది

ప్రేక్షకుల అభిరుచిని తెలుసుకుని వారికి యెలాంటి కథలు కావాలో, అలాంటివాటినే నిర్మించి, వారిని మెప్పించగల సామర్థ్యం దుక్కిపాటి మధుసూదనరావుగారికి వుందంటె అతిశయోక్తి కాదు. ఆయన నిర్మించిన చిత్రాల్ని ఒరిజినల్‌గా వ్రాయబడ్డ కథలని మీకు బాగా తెలుసు. అసభ్యశృంగారమో, అశ్లీల పదజాలమో ఆయన నిర్మించే చిత్రాల్లో కనిపించదు. చక్కటి సెంటిమెంట్స్ నిండిన కుటుంబ కథలను తెరకెక్కించడం ఆయనకు 'దొంగరాముడు' దగ్గర్నుంచి అలవాటే. ఇప్పుడు ఆయన అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ అనెడి కొత్త చిత్ర నిర్మాణసంస్థను స్థాపించారు. ప్రప్రథమంగా తెలుగుజాతి గర్వించదగిన ఒక పవిత్రమైన కథను తయారు చేయిస్తున్నారు. ఈ చిత్రానికి 'పవిత్రజీవితం' అని పేరు పెట్టారు. షూటింగు పూర్తయింది.

ఈ చిత్రానికి పినిసెట్టి కథ, మాటలను, రాజేశ్వరరావు సంగీతాన్ని సమకూర్చారు. వి. మధుసూదనరావు దర్శకత్వంలో సర్వజనరంజకంగా తయారవుతున్న 'పవిత్రజీవితం' లోని ప్రధానపాత్రలను అక్కినేని, గుమ్మడి, నాగభూషణం అల్లు రామలింగయ్య, రాజబాబు, భానుప్రకాష్, చంద్రమోహన్, రావికొండలరావు, కాంచన, శారద, సూర్యకాంతం, పద్మిని పోషించారు. సారథి స్టూడియోలో నిర్మించబడిన ఈ చిత్రానికి సెల్వరాజ్ ఛాయను, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని ఆర్. శ్రీనివాసరావు సహాయదర్శకత్వాన్ని నిర్వహించారు. ఈ చిత్రంలో కేంద్ర అవుట్‌డోర్ నయనానందకరంగా వున్నట్లు తెలుస్తూంది.

## మొదటిపాట రికార్డింగ్

జయలక్ష్మి మూవీస్‌వారి రెండవ చిత్రానికి సంబంధించిన మొదటిపాట రికార్డింగు జనవరి 29న విజయా గార్డె



'జీవిత చక్రం'లో రామారావు, శారద.



'నమ్మక ద్రోహులు'లో ప్రభాకరరెడ్డిపై చంద్రకళ ఆగ్రహం ఎందుకో?

ప్పులో జరిగింది

'ఎంత బాగ అన్నావు
ఎవ్వరు నేర్పిన మాటరా
వేలెడైనా లేవురా
వేదంలా విలువైన మాట'

—శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాసిన ఈ పాటను రమేష్ నాయుడు సంగీత సారథ్యంలో సుశీల మధురాతిమధురంగ ఆలాపించింది. ఈ చిత్రానికి భమిడిపాటి కథ, మాటలను సమకూర్చారు. షూటింగు మార్చి 1 నుండి ప్రారంభమవుతుంది. డి. వి. ఎస్. రాజు నిర్మించే ఈ సాంఘిక చిత్రంలో సావిత్రి కథానాయికగా నటిస్తోంది. ఆమె కుమారుడిగా శోభన్ బాబు, కోడలుగా వాణిశ్రీ, భర్తగా ప్రభాకరరెడ్డి నటిస్తారు. సహాయ భూమికలను నాగయ్య, నాగభూషణం, రాజబాబు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య ధరిస్తున్నారు. ఈ చిత్రానికి కన్నప్ప ఛాయను, వాలి శిల్పాన్ని, వి. రామచంద్రరావు దర్శకత్వాన్ని నిర్వహిస్తారు.

## సినిమా

## అందరికీ మొనగాడు

'గూఢచారి 116' చిత్ర దర్శకుణ్ని మీకు బాగా తెలుసు అనుకుంటా. ఆ చిత్రం చూస్తే, మనకు కొట్టొచ్చినట్టు కనిపించేది దర్శకుని హస్తలాఘవం. హీరో క్రిష్ణకు ఆ చిత్రంతో 'యాక్షన్‌హీరో' అని పేరువచ్చింది. ఇప్పుడు మల్లికార్జునరావు—క్రిష్ణ కాంబినేషన్‌లో మరొక సెన్సేషనల్ స్పయ్ చిత్రం రాబోతూంది. ఈ చిత్రంపేరు 'అందరికీ మొనగాడు' అడుగడుగునా సంభ్రమాశ్చర్యాలను కలిగింపచేసే దృశ్యాలు, నిమిష నిమిషానికి గగుర్పాటు కలిగించే సన్నివేశాలు, ఒళ్లు జలదరింపచేసే స్టంట్స్, తెలుగుచిత్రాల్లో యింతవరకు కానరాని శృంగార నయగారాలు 'అందరికీ మొనగాడు' చిత్రంలోని ప్రత్యేక ఆకర్షణలు. మధురమైన సంగీతం. ముచ్చటయిన ఛాయాగ్రహణం.



'విచిత్ర దాంపత్యం'లో
విజయలలిత అభినయం

మురిపించే నృత్యాభినయం ఈ చిత్రంలోని విశేషాలు. ప్రతి ఫ్రేములో దర్శకుడు మల్లికార్జునరావుయొక్క చాతుర్యం వెల్లివిరిసింది. సాహసంతో చేసిన ఈ ప్రయత్నం, ధైర్యంతో తలపెట్టిన ఈ యజ్ఞం నిర్విఘ్నంగా పూర్తి అయింది.

## గృహప్రవేశం

ప్రముఖ నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు మద్రాసులో ఒక భవంతిని నిర్మించారు. [illegible] లో మాడరన్

(60వ పేజీ చూడండి

## సినిమా డైరీ

● అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'పవిత్ర జీవితం' షూటింగు ఫిబ్రవరి 1 నుండి 8 వరకు వి. మధుసూధనరావు దర్శకత్వంలో అక్కినేని, కాంచన, శారద, రాజబాబు, రమాప్రభ పాల్గొన్నారు.

● సావిత్రి కంబైన్సు 'వింత సంసారం' షూటింగు ఏ. వి. ఎం. లో జనవరి 18నుండి ఫిబ్రవరి 6 వరకు సావిత్రి దర్శకత్వంలో జరిగింది.

● విశ్వజ్యోతి పిక్చర్స్‌వారి షూటింగు ఫిబ్రవరి 5న మానాపురం అధ్వర్యంతో వాహినీలో ప్రారంభమైంది.

● పద్మావతి ఫిలింస్‌వారి అందరికీ మొనగాడు ఫిబ్రవరి 13న పూర్ణాద్వారా విడుదలయింది.

● విశాల్ ప్రొడక్షన్సువారి క్రయిమ్ చిత్రం షూటింగు జనవరి 27నుండి 31 వరకు దాప్ దర్శకత్వంలో వాహినీలో జరిగింది. ఇది మొదటి షెడ్యూలు మాత్రమే.



భోజనం చేసేది వాణిశ్రీ—వడ్డించినది ఎవరు? 'రైతుబిడ్డ' చిత్రంలో.

స్టైల్‌లో నిర్మింపబడిన ఈ యింటికి 'శ్రీ నిలయం' అని పేరుపెట్టి, ఫిబ్రవరి 6 న (5 రాత్రి—6 వేకువ) సత్యనారాయణ వ్రత మాచరించి, వేదమంత్రాల నడుమ గృహప్రవేశం చేసారు. వెండి తెర ప్రముఖులందరూ వచ్చి శుభాశిస్సుల నందచేసారు. ఈ కాలనీని 'తెలుగు

## సినిమా

(58 వ పేజీ తరువాయి)

హాలివుడ్ కాలనీ' అని చెప్పవచ్చు. ఇక్కడ నిర్మాతలు చాల మంది యిళ్ళు కడుతున్నారు.

### బంగారుతల్లి

'మదర్ ఇండియా'ను చూసే వుంటారనుకుంటూ. ఇప్పుడు తెలుగులో 'బంగారు తల్లి' పేరిట రా బో తుం ది. చిత్రం ప్రారంభమై మూడు సంవత్సరాలైంది. ఇంకా మూడురోజులు పనిమాత్రమే మిగిలి వుంది. ఎన్ని సంవత్సరాలయినా, యిలాంటి చిత్రానికి మినిమమ్ గ్యారంటీ తప్పకుండా వుంటుంది. నిర్మాత హరిబాబుగారి పేర్ను దర్శకుడు చాణక్యగారి పేర్ను వృథాపోదు. ముఖ్యపాత్రను జమున పోషించిందా లేక ఆ పాత్రకోసం ఆమె పుట్టిందా అనిపించే విధంగా ఆమె నటించింది. క్రిష్ణంరాజుకు ఈ చిత్రం విడుదలయితే కొత్త మార్కెట్టు యేర్పడే అవకాశం యుంటేని వుంది. ఇర్తృత్వకు ఫలానాపాత్ర అయితేనే పోషించాలి అనెడి సిద్ధాంతం వుండరాదు అని జమున యిప్పుడే గాదు — 'మాయింటి మహాలక్ష్మి' అప్పుడే నిరూపించింది. తల్లి వుంటుంది. తల్లియొక్క లాలన, పాలనలోవుండే మధురిమను భూతికి సరిహద్దులే లేవు. తన పిల్లల స్వార్థం కోసం దేశమాతకు శృంగభంగం చెయ్యలేని కమనీయ తల్లియే ఈ 'బంగారుతల్లి'

## మీకు తెలుసా?

నటి జయలలిత తీరిక సమయాల్లో సీరియస్‌గా డిటెక్టివ్ నవలను చదవడంలో నిమగ్నురాలవుతుంది.

హాలివుడ్ నటుడు కార్‌గ్రాంట్ రోజుకి రెండుపూటలు స్నానం చేసేవాడట. అక్కడివాళ్ళు ఒక్క పూట స్నానం చెయ్యడమే అరుదట!

దర్శకుడు ప్రత్యగాత్మ 'జ్వాల' పత్రికకు సంపాదకునిగా వుండేవారట.

నటి కె ఆర్. విజయ స్వంత గుర్రం 'పాపాషినా' రేసుల్లో గెలిచి ప్రేక్షకులను ఆశ్చర్య చకితుల్ని చేసింది.

హాలివుడ్‌లో చిత్రనిర్మాణం తగ్గడానికి కారణం టెలివిషన్ అని అంటున్నారు!

## నోరూరిపోతు

కంటేనిండా నిద్ర, కడుపునిండా తిండి



'దెబ్బకు ఠా దొంగల ముఠా'లో ఇద్దరు దొంగలు— జ్యోతిలక్ష్మి, శోభన్ బాబు.

"పోతు"గా గొన్న ఒక అమాయక యువకుని విచిత్రగాథయే శ్రీ కల్పనాచిత్రవారి 'సోమరిపోతు' అయినింటి బిడ్డగా, గురక నిద్రకు అధినేతగా, పిపాట్లకు స్వామిట్లుగా చలం సరికొత్త నటన్ను ప్రదర్శించాడీ చిత్రంలో. డ్యాన్స్ తారగా, వ్యాంప్ స్టార్‌గా విఖ్యాతికెక్కిన జ్యోతిలక్ష్మి యొక్క కొత్తరూపాన్ని, విభిన్నమైన నటన్ను చూచి ఆశ్చర్యపోతాము. తెలుగు డైలాగులను చాలా బాగా పలికింది. సంఘంలో పదవికోసం, డబ్బుకోసం జరిగే ఎత్తుకుపై ఎత్తులను, అన్యాయ అఘాయిత్యాలను 'సోమరిపోతు' చిత్రంలో కళ్లకు కట్టినట్లు దర్శకుడు రామచంద్రరావు చిత్రీకరించారు. భమిడిపాటి మాటలొకప్రక్క, వెంకటేష్ బాణీలు మరొకప్రక్క పోటాపోటీగా పరుగిడితే కె.ఎస్. ప్రసాద్ ఛాయాగ్రహణం 'సవాల్' చేసిందనే భావాన్ని కలిగిస్తుంది. తెలుగు చిత్రాల్లో యిదొక కొత్త అటెంప్టు అనే చెప్పాలి. కె. బాబూరావు నిర్మిస్తున్న ఈచిత్రం పూర్ణాపిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది.

## క్రిష్ణచిత్రాలో హరనాధ్ దేవిక

'అరుంధతి' చిత్రాన్ని నిర్మించిన జి. కె. రెడ్డి 'క్రిష్ణచిత్ర'ను స్థాపించారు ఈ చిత్రంయొక్క షూటింగు హైదరాబాదు అజంతా స్టుడియోలో జరుగుతుంది. ముఖ్య భూమికలను హరనాథ్, దేవిక, విజయశ్రీ ధరిస్తారు. కథను స్టుడియో స్టోరీశాఖ వ్రాయగా, మాటలను గౌతమ్ సమకూరుస్తున్నారు. ఫిబ్రవరిలో ప్రారంభించబడే ఈచిత్రానికి శోభనాద్రిరావు దర్శకత్వాన్ని అశ్వత్థామ సంగీతాన్ని, జయరామ్ ఛాయను, అరుణాచలం శిల్పాన్ని నిర్వహిస్తారు.

## కళ్యాణ మంటపం

కన్నడభాషలో 'గజ్జెపూజ' పేరిట విజయవిహారం చేసిన కథను [illegible] దర్శకుడు వి. మధుసూదనరావు తెలుగులో భారీయెత్తున నిర్మిస్తున్నారు. కలరులో నిర్మించబడే ఈ సమస్యాత్మకమైన చిత్రానికి 'కళ్యాణమంటపం' అని పేరు పెట్టారు. 'మనుషులు—మారాలి' లాగా ఈచిత్రం కూడా తెలుగుచిత్ర జగత్తులో మరొక సంచలనాన్ని సృష్టించి తీరుతుందనవచ్చు.

ఇటీవల రాజమండ్రివద్ద జరిగిన అవుట్‌డోర్ షెడ్యూలులో చిత్రంయొక్క పతాక సన్నివేశాలను దర్శకుడు చిత్రీకరించారు. ఈచిత్రంలోని ముఖ్యపాత్రలను శోభన్‌బాబు, జగ్గయ్య, గుమ్మడి, నాగభూషణం, కాంచన, అంజలి, పండరీబాయి, రమాప్రభ, సంధ్యారాణి, అన్నపూర్ణమ్మ పోషిస్తున్నారు. ఎం. కె. ఇందిర వ్రాసిన కథకు, బొల్లిముంత శివరామక్రిష్ణయ్య మాటలను సమకూర్చారు. నవయుగ విడుదల చేస్తే

[illegible] శ్రీ [illegible] గాయకుడు, ఆదినారాయణరావు సంగీతాన్ని, నృత్యం కూర్పును నిర్వహిస్తున్నారు.



# సినిమా

## మా ఇలవేల్పు

తమిళంలో విజయవంతంగా ప్రోగిస్తున్న 'నమ్మపిట్ట దైవమ్' చిత్రాన్ని కామాక్షి ఏజన్సీ తెలుగులో 'మా ఇలవేల్పు' పేర నిర్మిస్తున్నారు. షూటింగు ఫిబ్రవరి 1వ ప్రారంభమైంది. జి. ఎస్. వేలుమణి వ్రాసిన కథకు, రాజశ్రీ మాటలను సమకూర్చారు. జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకత్వంలో తయారయ్యే యీ 'సోషియో — పౌరాణిక' చిత్రానికి జి. కె. వెంకటేష్ సంగీతాన్ని భాస్కరరావు ఛాయను, రాజా—శేషు నృత్యాలను నిర్వహిస్తున్నారు. ముఖ్యపాత్రలను కె. ఆర్. విజయ, రామకృష్ణ, నాగభూషణం, పద్మనాభం, మిక్కిలినేని, పొట్టి ప్రసాద్, ధూళిపాళ, మనోహర్, ఛాయాదేవి, పద్మాంజలి, విజయశ్రీ, మధుమతి, రమాప్రభ ధరిస్తున్నారు. నిర్వాహణ: పి. ఎస్. వాచముత్తు.

—శ్రీనివాస్ ●

అవీ.. ఇవీ!

### మదరాసులో 'ఫెస్కా' ఆవిష్కరణ

గోద్రెజ్ సోప్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారు కొత్తగా రూపొందించిన ఫెస్కా బ్యూటీ టాల్కని ఈనెల 3 వ తేదీన హోటల్ అశోకాలో జరిగిన ఒక సమావేశంలో విడుదల చేశారు. ఈ సమావేశానికి దక్షిణాది రాష్ట్రాలలోని హోల్‌సేల్ డీలర్ లెక్కలేకమంది హాజరైనారు. కె. జి. జానకి ముఖ్య అతిథిగా విచ్చేశారు.

ప్రారంభంలో ఆహూతులందరికీ సంస్థ బ్రాంచి మేనేజరు శ్రీ ఎ. కె ఎస్. రావు స్వాగతం చెప్తూ గోద్రెజ్ సంస్థ ప్రాముఖ్యతని, అభివృద్ధిని వివరించారు.

గోద్రెజ్ సోప్స్ ప్రైవేట్ లిమిటెడ్ సేల్స్ మానేజర్ శ్రీ ఎస్. ఎస్. మిరాజ్‌కర్ మాట్లాడుతూ రెండు సంవత్సరాల సంతృప్తికరమైన పరిశోధనా ఫలితంగా ఈ ఫెస్కా తయారీ చేయడం జరిగిందని వివరించారు. ఉపయోగించినప్పుడు ముఖంపై తెల్లని మెరుగు చూడటానికి చాలా అసహ్యంగా ఉంటుందని, అలా కాకుండా సమంగా చర్మంతో కలిసిపోయేలా, ఆహ్లాదకరమైన చక్కని సువాసనతో ఈ ఫెస్కా రూపొందింపబడినదని వివరించారు.

ప్రముఖ నటి శ్రీమతి షావుకారు జానకి ఫెస్కాని విడుదల చేస్తూ ఇంతకుముందు మంచి అలంకరణ సాధనాలు వాడాలంటే విదేశీ వస్తువులనే కొనాల్సి వచ్చేదని ప్రస్తుతం గోద్రెజ్‌వారు ఉత్పత్తి చేస్తున్న వస్తువులు సరసమైన ధరకి లభిస్తూ వాణ్యతలో విదేశీ వస్తువుల కేమాత్రం తీసిపోకుండా ఉన్నందున దిగుమతి అయిన టాయిలెట్స్ కొనాల్సిన అవసరం తప్పిందని అన్నారు.

అనంతరం కుమారి యడవల్లి రమ కూచిపూడి నృత్య ప్రదర్శన జరిగింది.

మదరాసు బ్రాంచి అసిస్టెంటు శ్రీ కె. రామానుజం వందన సమర్పణలో సమావేశం జయప్రదంగా ముగిసింది. [ఓ. వి.]

### మదరాసులో 'పూలరంగిడు' నాటిక ప్రదర్శన

రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ఆంధ్ర యువజన సమితి [మద్రాసు] వారు పూలరంగడు నాటకాన్ని శ్రీ బి. ఎస్. రెడ్డి అధ్యక్షతన రసవత్తరంగా ప్రదర్శించారు.

హీరయ్యగా శ్రీ పి. దామోదరరావు ప్రశంసనీయమైన నటనను ప్రదర్శించారు. పి ఎస్. రాజారావు, కొండలరావులు హాస్యంతో ప్రేక్షకులకు వినోదాన్ని కల్గించారు. ఇతర ముఖ్యపాత్రలని శ్రీయుతులు డి. బలరామమూర్తి, కె. భాస్కరరావు, కె ఆర్. పార్వతీశం ఆచారి, ఎస్. నాకలరాజా, కె. రామారావు, డి యస్. రామ్మోహన్, బి రాములు పాత్రోచితమైన నటనతో ప్రదర్శనని రక్తి కట్టించారు

కుమారి ఎం. లీలారాణి [రంగమ్మగాన, రాణీగాను] ద్విపాత్రాభినయం చక్కగా చేసింది.

ప్రస్తుత వాతావరణానికి తగినట్లుగా ఈ నాటకం ప్రేక్షకులకు వినోదాన్ని కలిగించి, అలరించినది అన్నారు శ్రీ బి. ఎస్. రెడ్డి. అనంతరం నాటక రచయిత శ్రీ జి. యస్. వతికి సన్మానం చేశారు.

నాటకానికి దర్శకత్వం, పాటలు శ్రీ బి. నాగరాజన్ కూర్చారు సంగీతం జాన్. డిసోజా. నిర్వహణ— శ్రీ కె.ఆర్. పార్వతీశం ఆచారి. [ఓ.వి.] ●



మోహన్ కుమార్

## డూండీ



ఇవాళ హిందీ మార్కెట్లో కూడా స్థిరమైన నిర్మాతగా పేరు సంపాయించుకున్న శ్రీ డూండీ— సుందర్ లాల్ నహతా గారి ద్వారా మొదట చలనచిత్ర సీమలో ప్రవేశించారు. ప్రొడ్యూసర్‌కి కావలసిన అర్హతలేమిటో నిర్ణయించుకుని ఆయన సుందర్లాల్ గారి అప్రెంటీస్ ప్రొడ్యూసర్‌గా 58,59,60ల్లో శభాష్‌రాజా, మంచిమనసుకు మంచిరోజులు, అభిమానం, శాంతినివాసం చిత్రాలకు పని చేశారు. ఈ మూడేళ్ళలోను ఆయన ప్రొడక్షన్, కెమెరా, ఎడిటింగ్, డైరెక్షన్ శాఖలను క్షుణ్ణంగా తెలుసుకోగలిగారు.

స్వతంత్ర నిర్మాత అయిన డూండీ యీ పదేళ్ళలోను సుమారు 20 చిత్రాలను ప్రొడ్యూస్ చేశారు. రాజలక్ష్మి, విజయలక్ష్మి, రాజశ్రీ ప్రొడక్షన్స్ సంస్థలతో ప్రత్యక్ష సంబంధాలే గాక, మధు, సునందినీ, భారతీ ఇంటర్నేషనల్ వంటి సంస్థలతో ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా అయినా సంబంధం ఉంది డూండీకి. అనతికాలంలోనే విజయవంతమయిన నిర్మాతగా నిలబడటానికి ముఖ్యకారణం— ప్రొడ్యూసర్‌గా ఆయన క్వాలిఫైడ్ కావటమే!

చిత్రనిర్మాణపు విలువలు ఈనాడు ఎంతగానో పెరిగాయి. ఆ విషయంమీద ఈ మధ్య శ్రీ డూండీతో ముచ్చటిస్తున్నపుడు అప్పటికన్న కాస్ట్ ఆఫ్ ప్రొడక్షన్ ఇపుడు కొంత పెరిగిందంటారా? అంటూ అడిగాను.

కొంతేమిటి, బాగా పెరిగింది. మాకు ఖైదీ కన్నయ్య చిత్రానికి 60లో ప్రింట్లతో కలిపి రెండున్నర లక్షలయింది. ఇవాళ అయిదు లక్షలవుతోంది. అంటే వందశాతం పెరిగిందన్నమాట! అన్నారాయన.

ఈ పెరుగుదల అనేది ఏరకంగా ఏర్పడింది?

అన్ని రకాలుగా... సినిమాకు అవసరమయ్యే ముడిసరుకులన్నీ బాగా పెరిగాయి. వీట్నికి తోడు ఆర్టిస్టుల డిమాండ్స్ కూడా అధికమయ్యాయి. నిర్మాణవ్యయం వందశాతం పెరిగినా— ఎన్నో చిత్రాలు ఈ రోజున దెబ్బ తింటున్నా—కొత్త వాళ్ళను తీసుకు రావటం గాని, కాస్ట్ తగ్గించటానికి గాని ఎవరూ ఎందుకు ముందుకు రావటం లేదనేది అర్థం కాదు. ఈ పరిస్థితికి నిర్మాత క్వాలిఫైడ్ కాకపోవటం కూడా ఒక కారణం కావచ్చును.

ఇపుడు వస్తున్న చాలా సినిమాల కథలు బాగా ఉండటం లేదని జనం తమ నిరాశను వ్యక్తం చేస్తున్నారు. ఎందుకని?

అయిదు లేక ఆరు సినిమాలు వచ్చేవి అప్పుడు ఏటా...ఇప్పుడు 70 చిత్రాలు విడుదలవుతున్నాయి. జనం అంత విద్యాధికులు కారానాడు. సినిమాలు చూడటం తెలుసుకున్నారీనాడు. కనక యిపుడు 70 కథలు కావాలి. అంచేత మంచివి దొరికే అవకాశం తక్కువ.

ఫిలిం కౌన్సిల్ ఏర్పడటం మంచిదంటారా?

ప్రభుత్వం నిర్వహిస్తున్న పరిశ్రమలు ఎలా నడుస్తున్నాయో మనం చూస్తూనే వున్నాం. సినిమా పరిశ్రమ ఏమవుతుందోననే భయం వున్నది. ఫ్రీడమ్ ఆఫ్ ఎక్స్‌ప్రెషన్ తగ్గుతుంది. అయితే సవ్యమయిన పద్ధతిలో సాగితే ఒకరకంగా మంచిదే! బ్లాక్ మనీ తగ్గిపోతుంది. ప్లాన్డ్ ప్రొడక్షన్‌కి అవకాశం ఉంటుంది. ప్రభుత్వ నిర్వహణలో అర్హతలు అడుగుతారు గనుక అందువల్ల బెనిఫిట్ ఉంటుంది అన్నారు శ్రీ డూండీ.

## జగ్గయ్య



కిందటి నెలాఖరు రోజున జమున గారింట జరిగిన విందుకు జగ్గయ్య హాజరయ్యారు. ఆ సందర్భంగా ఆయనను కలిసినపుడు మీరీ సారి ఎన్నికల్లో నిలబడుతున్నారా? అని అడిగాము.

లేదు! అన్నిరాయన

ఎందుకని?

ఈ ఎన్నికలు మధ్యంతరంగా వచ్చాయి. నేనిపుడు చాలా చిత్రాల్లో నటిస్తున్నాను. ఆ సంగతి మీకూ తెలుసు. నిర్మాతలు అందరికీ ముందుగా కాల్ షిట్స్ యిచ్చేశాను. ఇపుడీ ఎన్నికల్లో పోటీ చేస్తే నా నిర్మాతలంతా సఫర్ అవుతారు, అందుకని!

71 జగ్గయ్య గారికి మంచి సంవత్సరం. ఇప్పుడా యన దాదాపు 10 చిత్రాల్లో అయినా నటిస్తున్నారు. ఎంతో బిజీగా వున్నారు. గత సంవత్సరం చివరిరోజున విడుదలయిన ద్రోహి ఆయనలోని నటనా ప్రతిభను మరోసారి రుజువు చేసింది.

72లో జరిగే ఎన్నికలకయితే నించునేవాడి! ఇప్పుడిలా మధ్యంతరంగా వస్తాయని అనుకోలేదు. అయినా ఎన్నికలకి ముందు ఐదారు మాసాల ప్రిపరేషన్ ఉండాలి కదా!...వీటన్నిటి దృష్ట్యా యీ సారికి తప్పుకుంటున్నాను అన్నారు జగ్గయ్య.

జగ్గయ్య విద్యావంతుడయిన చక్కని నటుడేకాదు, వివేచనా పరుడు, సూక్ష్మగ్రాహి. ఈ సంవత్సరం ఆయన దర్శకత్వపు శాఖలోకి కూడా అడుగు పెట్టబోతున్నట్టు ప్రకటించారు. ఆవిషయం గురించి కదుపగా అవును. దీనిని గురించి కొద్ది రోజులు పోయాక ముచ్చటించుకుందాం. వివరాలు అప్పుడు చెప్తాను అన్నారు జగ్గయ్య.

## బి. సరోజాదేవి



సుమారు నూట పాతికచిత్రాల్లో నటించిన తార శ్రీమతి బి. సరోజాదేవి యీ మధ్యంతర ఎన్నికల్లో నిలబడతారనేది మద్రాసునగరమంతా వ్యాపించింది. అనేక పత్రికల్లో యీ వార్త ప్రచురింపబడటం జరిగింది కూడాను.

బెంగుళూర్ నుంచి కిందటివారం మద్రాసుకు వచ్చిన సరోజాదేవిని ప్రసాద్ ప్రొడక్షన్స్ కన్నడ చిత్రం సెట్స్ మీదకలుసుకున్నపుడు మీరీ ఎన్నికల్లో పోటీ చేస్తారని వినటం జరిగింది. ఎంతవరకూ నిజం? అని అడిగాను.

నేను పోటీ చేయటం లేదు అన్నారు. సరోజాదేవి.

మరి మీరు పోటీ చేస్తున్నట్లు పత్రికలలో వార్తలు వెలువడ్డాయి అన్నాను.

నన్ను మధ్యంతర ఎన్నికల్లో పాల్గొనవలసిందిగా సంస్థాకాంగ్రెస్, కొత్తకాంగ్రెస్ ఉభయ పార్టీల వాళ్ళు కోరారు. అందువల్ల పత్రికలలో వెలువడి ఉండవచ్చు అన్నారామె.

ఆపార్టీలవారు ఎన్నికల్లో నిలబడమని ప్రోద్బలం చేయటం చేత ఆలోచిస్తానని చెప్పి ఉండవచ్చు సరోజాదేవి. అప్పటికామె ఏ నిర్ణయమూ తీసుకోక పోవచ్చు.

అయినా ఎన్నికల్లో పోటీ చేయటానికి నాకిప్పుడు తీరికలేదు అంటూ ఆ విషయాన్ని విడిచిపెట్టేశారు సరోజాదేవి. ఇప్పుడామె 5 తమిళచిత్రాల్లోను, రెండు కన్నడ చిత్రాల్లోను, ఒక తెలుగు చిత్రంలోను నటిస్తున్నారు. తెలుగుచిత్రం విశ్వజ్యోతి పిక్చర్స్ వారిది. జగ్గయ్యగా అందరికీ కాల్‌షిట్స్ ఇచ్చేశారు. ఎన్నికల్లో పాల్గొనాలనే ఉత్సాహం లేక పోవటానికి ఒక కారణం కావచ్చు.

# పుస్తకాలు

## దయ్యాలు లేవూ?

రచన: శ్రీమతి లత, 134 పేజీలు.

## (సి) నీతిచంద్రిక

శ్రీ రావికొండలరావు 119 పేజీలు.

ఈ రెండూ ఎమెస్కో పాకెట్ నవలలు వెల రెండేసి రూపాయలు. ప్రచురణ ఎం. శేషాచలం అండ్ కో మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాదు.

దయ్యాలంటే పసివాళ్ళు ధుడుసుకుంటారు ఆ పేరు చెబితేనే హడలిపోయే పెద్దవాళ్ళూ ఉన్నారు పిరికిగుండెవాళ్ళు— అంటే దెయ్యాలున్నాయని నమ్మే వాళ్ళు. గుండె నిబ్బరమున్న ధైర్యస్థులూ వున్నారు. దయ్యాలా పెత్త—ఏం లేవు? పోపో అని దులాయిస్తారు వాళ్ళు నమ్మకంలేని వాళ్ళన్న మాట

ఈ విధంగా—దేవుడున్నాడు, లేడు అని రెండు పార్టీలున్నట్లుగానే దయ్యాల విషయంలో కూడా రెండు కక్షలు ఏర్పడి వున్నాయి

లతగారు దయ్యాన్ని చూడనే లేదింతకీ,. అయినా—తెలియనవి లేవనుకోవటం పొరబాటు కాబట్టి ఆసక్తికొద్దీ ఆమె దయ్యాలలోకం పరిశీలించి పరిశోధించి, హృదయంగమంగా ఉండే కొన్ని ఉదంతాలను సంతరించారు. చమత్కారమైన వాటి కూర్పే ఈ నవల

దయ్యాలు వచ్చేది లెక్కకు కొద్దిమందికే, వాటి గాథలు మట్టుకి పిన్న పెద్ద అందర్నీ ఒక్కలా ఆకర్షిస్తాయి ఇంగ్లీషులో ఘోస్ట్ స్టోరీస్ కో కొల్లలు. తెనుగులో యిలాంటివి స్థానాపతి రుక్మిణమ్మగారు రాసి ప్రకటించారు.

ఇప్పుడీనవల పరిధిలో— భూచక్ర పటాన్ గిరగిరా తిరిగి నట్టుగా— ఎన్నెన్నో విషయాలు చకచక నెమరుకు వస్తాయి. రేడియో ఎనౌన్సర్లు, డిస్ట్రిబ్యూటర్లు— జర్నలిస్టులు, ప్రూఫ్ రీడర్లు,—పుస్తక సమీక్షలు, పత్రికల్లో ప్రశ్నలకు రచయిత్రుల సమాధానాలు— పూర్ణ కవులు, శ్రీశ్రీ వంటి నవకవులు, — గాయత్రి జపాలు. శివపూజలు— వైష్ణవ గురువుల ప్రణయ రహస్యాలు— ఇవిగాక వెయిరీ టేల్స్‌లో వచ్చే లంకెబిందెలు, నిధి నిక్షేపాలు. పిశాచాలకు వీటితో సంబంధం— ఇలా ఒక్కసారి సరదాగా రంగులరాట్నం తిరుగుతాం.

దయ్యాలున్నాయా లేదా? అది కాదు, సమస్య వాటిలో నమ్మకముందా లేదా? అని ఒక నిశ్చయానికి రావాలంటే, నాటికి మురుకులు పగిలించే గొప్ప సస్పెన్స్‌ను ఆనందించాలంటే ఈ కామినీ కాముక పిశాచాల నవలలను చదివే తీరాలి.

*   *   *

ఈనాడు సినిమా చూడని వాళ్లెవరు? కాని, ఆది ఆ బొమ్మ ఎలా తయారవుతుందో, అని వారె చాలామంది నిజంగా ఆ తెరవెనుక భాగోతాలు తెలిస్తే విస్తుపోతాం.

లక్షల ధనం, వందలాది జనం— నటనా ప్రవీణులు— అనుభవంలేని సరికొత్త వాళ్ళు,— దిష్టోరం, హంగులు— వంచనలు, ట్రిక్కులు, బోల్తాలు, పిల్లి మొగ్గలు, దళారీలు, వటి ఆడపిచ్చివాళ్ళు,—ఆకాశ సౌధాలు, ఆశాభంగాలు, జయాపజయాలు— పచ్చి రాజకీయాలు— చివరికి అందలం ఎక్కడమో, నెత్తికి చేతులో— ఇటువంటి లోగుట్లు ఎన్నెన్నో నడచి నడచి బొమ్మ తెరపైకి ఎక్కితే మనం చూస్తాం. ఇన్ని పాట్లు పడి తీసిన చిత్రం చూసి, చప్పరించటమో, చప్పట్లు చరచడమో జరుగుతుంది.

కొండ్రావు, కాకలు తీరిన హాస్య నటుడు. నాటకకర్త, పూర్తి సినిమా మనిషి. ఈ విద్యకు అంకితమయిన వ్యక్తి కనుకనే చలచ్చిత్ర ప్రపంచ హితోపదేశం ద్వారా పరిశ్రమలో ప్రవహించే కుళ్ళు కడిగి, క్షాళనం చేసి అవసరమైన చోటల్లా మొట్టికాయలు మొట్టి దెబ్బలిశాడు.

చిత్రలాభం— చిత్రభేదం— చిత్రఖేదం— చిత్రమోదం— అనే నాలుగు శీర్షికలతో నడచిన— వ్యంగ్య పూరితమైన ఈ నవల సినీ పరిశ్రమ గుట్టు మట్టులు వెల్లడిస్తుంది తంత్రాలు బయట పెడుతుంది అంతేకాదు— చదివిన వారు పకపక నవ్వటం ఒక ఎత్తు, కొంతమంది బుజాలు తడుముకోవటం ఒక యెత్తు.

—శివకుమారి

## జ్యోతి

రచయిత, యం. రామకోటి, నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరురోడ్, విజయవాడ—2. వెల రు 5—00.

ఈ నవలలో జ్యోతి కథానాయిక. ఆమెపాత్రని పెంపడంలో రచయిత చూపిన ఏకాగ్రతవల్ల తక్కిన పాత్రలు కొంత ఆమె కొంగుపట్టుకు వేళ్ళాడాయే అనాలి.....

హైకోర్టు వకీలు జనార్దన రావుగారి వద్ద శిష్యరికానికి వెళ్ళిపోయిన జ్యోతి సుప్రీంకోర్టుకు ఆయనతో వెళ్ళి, అక్కడనుంచి ఆయనతో రాజమహలు చూడబోతుంది ఆ వాతావరణంలో చనిపోయిన తన భార్య లక్ష్మి గుర్తుకు వచ్చిన జనార్దనరావు గారు తన ఎదుట వున్న జ్యోతిని గమ్మున కౌగలించుకుని, నువ్వే నాలక్ష్మివి జ్యోతీ లక్ష్మి. జ్యోతిలక్ష్మి, అంటూ ఆమె పెదిమలమీద ముద్దుల వాన కురిపించేసరికి మిమ్మల్ని మెప్పించిన లక్ష్మిలాంటి సతీమణి నాతో ప్రతిబింబించడం నా అదృష్టం అని ఆయన భార్యగా స్థిరపడిపోతుంది గమ్మున. ఆమె మనస్తత్వము బ్రహ్మ కెరుక. నవలలో గోపాలం పాత్రకు అవగింజంతైనా, ప్రయోజనమూ లేదు, న్యాయమూ కలుగలేదు. రచయిత న్యాయశాస్త్రంలో నిష్ణాతుడై లోక వర్తమానాన్ని ఎరిగిన దిట్ట కనుక కోర్టు సంబంధ విషయాలూ అవీ సరదాగా వున్నాయి. నవల చదువుతుంటే మాత్రం విసుగెత్తక చక్కని శైలిలో వుంది.

## పూజాఫలం

రచయిత, విభావసు, నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరురోడ్, విజయవాడ—2., వెల: రు.5-00.

ఈ నవలలోని ముఖ్యమైన ముత్యం మూడు పాత్రలూ నేరుగా దేవునివద్దనుంచి ప్రత్యేకమైన వరాలు పొంది వచ్చాయేమో ననిపిస్తుంది. భర్త చేత వదిలివేయబడి, అనూరాధ భర్తచేత వంచింపబడిన అనంతలక్ష్మి పట్నంలో వో ధనికుని క్రింద అతి రివాజుగాపడి, లేచాక ఆయన కూతురులో సమానమయి, ఆస్తి పాస్తులను, కంపెనీలనూ వుద్ధరించి భారీఎత్తున లాభాలు వచ్చేలా చేస్తుంది సర్వీసు కమిషను వుద్యోగం కోసం తన సొంత వూరు వదలిన భాస్కరం అనంతలక్ష్మి చేసిన ఇంటర్వ్యూలో ప్యాసయి ఆకంపెనీ మేనేజరై పోతాడు. ఇక—విధవకేశాపమేల! పూవులు పసుపుబొట్టూ ఏల వుండరాదు అని తేల్చుకోడానికి లోకం మీదికి బయలు దేరిన అనూరాద వో డాక్టరు దంపతుల ప్రాపులో వారి కూతురుగా పెరిగి, డాక్టరు చదివేస్తుంది. ఆనక వారి పెంపుడుకొడుకు డాక్టర్ మహమ్మద్ డేవిడ్ గోపీ [అతనిపేరు]ని పెళ్ళాడుతుంది.

సామాజిక మార్పును సాధించాలనే సదుద్దేశ్యంతో యీ నవల రాసినట్లు రచయిత ఒక్కమాట లో వివరించారు. —పాఠకుడు

## ఎదగండి

సెయ్యా సెయ్యా కలిపి ఒక్కదేసంగ, ఒక్క పెజగ సెక్కు సెదరకుండ ఎలుగుదారి— అంటూ గేయరూపంలో ప్రజను ఎదగండెహె! అని రంధి సోమరాజుగారు నెంబర్ టు కరపత్రంలో రాజమండ్రినుంచి హెచ్చరించారు. ఎంతో బాగుంది.

## ఉగాదికల్చరల్ ఎకాడెమీ

మద్రాసులో తెలుగు ప్రజలకి తెలుగుతనాన్ని జ్ఞాపకం చేసే ఉగాదికల్చరల్ ఎకాడెమీ ఒక వార్షిక సంచికను ముద్రించారు. సంపుటి కార్యకలాపాలు, వివిధ వ్యాసాలు ఉన్నాయి. స్థాపకులు శ్రీ ఆత్మకూరి కస్తూరిరంగాచార్యులు, అధ్యక్షులు శ్రీ టి వి. సోమయాజులు.

## వ సు ధ

వసుధ సచిత్ర మాసపత్రిక. 5-4-776, అబిడ్స్. హైదరాబాదు -1. వెల ఒకరూపాయి. శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ గౌరవ సంపాదకురాలుగా ఉన్న ఈ కొత్త పత్రికలో శ్రీయుతులు పురాణం సుబ్రమణ్య శర్మ, మంజు శ్రీ, దాశరథి రంగాచార్య, గోపాల చక్రవర్తి, వెంచాశా, మూర్తి, ఆనందరామం, శ్రీమతి ఉప్పువ విజయలక్ష్మి, శ్రీ వి. రాజా రామమోహనరావు, శ్రీమతి మాలతీచందూర్. శ్రీయుతులు నిఖిలేశ్వర్, కె. వి. రమణారెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తి, కోణంగి రావు, సంజీవదేవ్. కొడవటిగంటి కుటుంబరావు, శ్రీమతులు బి. కృష్ణాబాయి, ముప్పాళ రంగనాయకమ్మ. డాక్టర్ మిత్రా, శ్రీ ప్రదీప్‌ల రచనలు ఉన్నాయి. ఇతర శీర్షికలుకూడా కల సుద్ధముద్రణ చక్కగా ఉంది. —ఒక సమీక్షకుడు

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.